# జీవనజ్యోతి

మహేంద్ర



విజయభారతి పబ్లికేషన్స్

పటమట — విజయవాడ.

# జీవనజ్యోతి

(కథల సంపుటి)

రచన:

"మహేంద్ర"

విజయభారతి పబ్లికేషన్సు
పటమట - విజయవాడ

2

ప్రథమ ముద్రణ
అక్టోబరు '61
వెల: రు. 1 _ 50

నవభారతి ప్రెస్
విజయవాడ _ 2

## ఇందులో....

# నా మాట

"జీవనజ్యోతి" నాలో ఎన్నో రోజుల్నుంచీ మెలుగుతూ నా భారమైన జీవితాన్ని ముందుకు నడిపిస్తున్న ఆశాజ్యోతి.

ఇందులో కథలు- ఊహాలు అపోహాలుతో విలాసాల్లో తేలిపోతూ, ఊహించిన గాలిమేడలు కావు.

ఇందులో ప్రతి కథ విషాదమానవులు వారి అభాగ్య జీవితాలలో, నిరంతరము ఆశయ, అనుభవాలమధ్య ఎనలేని సంఘర్షణతో నలిగిపోతూ జీవితాన్ని బరువుగా, భారంగా పొడిగిస్తున్న ఒక కథ. ప్రతి జీవితములో ఎదురయ్యే సామాన్య సమస్య ప్రతి కథకి కథావస్తువు, ప్రతి ఒక్కరికీ తెలిసిన నగ్నసత్యం. అందుకే ఇందులో ప్రతి కథకి ఒక ప్రత్యేకతవుంది. ఆంధ్ర సారస్వతలోకం ఆదరంతో అందుకుంటారని ఆసిస్తున్నాను.

మీ "మహేంద్ర."

# ౮

ఆ రోజు ఉదయం హాస్పిటల్లో యింజక్షన్ రూము లోకి అడుగు పెడ్తూనే ఆశ్చర్యపోయాను. ఎవరో కిశోర లావణ్యమూర్తి అందాల అప్సరస హాక్టసు స్థానంలో కూర్చొని వుంది.

పదహారేళ్ళుండవచ్చు. దివ్య సుందరమూర్తిలా వుంది. ఆమె సుందరమైన శరీరం, సుకుమారమైన స్వరూపం, సునిశితమైన దృష్టి, సుదీర్ఘమైన కేశశ్రీ, సువిశాలమైన ఫాలం నన్ను ఏదో వ్యక్తంకాని లోకంలో విహరింప చేసినయ్. ఏదో మతిమరుపు పొర నా మనోరంగంనుండి తొలగి పోవటానికి ప్రయత్నించి విఫలమైంది. ఆమెను ఎప్పుడో... ఎక్కడో నేను... నేనే చూసినట్లుంది.

ఏడు కానవస్తోంది. ఇంజక్షన్ రూమ్లో ఒక్కర్తె కూర్చొని వుంది. ఇంకా అప్పుడే పేషెంట్లెవరూ రాలేదు. అవును, అందరూ నాలాటి దురదృష్టవంతులుంటారనేమిటి? నిన్న నాకు రాసిన యింజక్షన్ అయిపోయింది. నిన్నటి చీటీ మీద యివాళ చేయించుకోటానికి నేను ప్రొద్దున్నే వచ్చానని అందరెలా వస్తారు.

ఆలోచిస్తూ, అలవాటు ప్రకారం, అప్రయత్నంగానే నమస్కారం చెప్పాను. ఆమె నవ్వుతూ ప్రతినందన మాచరించింది. ఆ నవ్వుల వంపుల సొంపులలో వెయ్యి పద్మాలు విచ్చినట్లయింది. ఆమె దంతాలు మేలిరకపు తెల్ల వజ్రాల

వరుసను దృష్టికి తెస్తున్నయ్. కిటికీలగుండా లేయెండ పడు తోంది. అందులో, ఆమె పసిమి పచ్చని ఫాలం మిలమిలా మెరిసిపోతోంది. ఆ లే యెండలో ఆమె గులాబీల చెక్కిళ్ళు వాడిపోతా యనిపించింది. ఆమె సువిశాలమైన నల్లటి కాటుక నేత్రాలు, నిబిడ నిశిలోకి నిశితంగా చూస్తున్నట్లున్నయ్.

ఎందుకో అప్రయత్నంగా నవ్వేశాను. ఆమె ఋూ తఫా నవ్వలేదు. చిరుకోప మభినయించ ప్రయత్నించింది. ఆ కోపా నికే ఆమె పెదవులు నలిగిపోయినై. ఆమె ఫాలం కొంచెం ఎరుపెక్కింది, ఆమెవైపే చూస్తున్నానని గమనించి తటాలున పైట సరిజేసుకుంది. జడ సర్దుకుంది. నల్లత్రాచులాటి ఆమె సుదీర్ఘ కేశశ్రీ ముందువక్షస్థలంమీద నాట్యం చేస్తోంది. చాలాసేపు మౌనం గోడలు కట్టింది. నోరు పెగిల్చి అనే శాను.

"ఇంజక్షన్" నెమ్మదిగా అంటూ వుండగానే ఆమె అందుకుంది. "యిప్పుడే చేస్తాను" అంటూ ఆమె లోపలికి పోయింది. వెంటనే పేషెంట్సు రిజిష్టరు తెచ్చింది.

"మీ పేరు?" మృదువుగా ప్రశ్నించింది.

"కృష్ణమూర్తి" ముక్తసరిగా చెప్పాను.

"ఇంటిపేరు."

"జి" తాపీగా చెప్పాను.

రిజిష్టరులో పేరు ఎక్కించుకున్నట్లుంది. ఆమె నన్ను ఒకసారి ఆపాదమస్తకం చూసింది. అంతలో ఆమెకు సిగ్గు తెర ముంచుకొచ్చింది. సిగ్గు చీరె శృంగారంలో ఆమె అవ

యవ్వాల పులకితాన్ని చాచుకుంది. కిటికీకేసి, బంగారుతీగెల లాంటి సూర్యకిరణాలకేసి తదేకంగా చూస్తోంది. మరొకసారి నా వైపు చూసి చిన్నాలున తల వంచుకుంది. ఆ ముఖంలో అనూయకత అచ్చుగుద్దినట్లుంది.

ఆశ్చర్యపోయాను. ఇంతసేపా రిజిష్టరులో పేరెక్కించటానికి. ఆమె కూడా నాలాగ ఏదైనా ఆలోచిస్తుందేమో! ఆమెకూడా నాలాగ జ్ఞప్తి మరుపుల సంధ్యలో అల్లాడుతుందేమో. ఆమె సునిశితమైన దృష్టిని నా పాదాలమీద లగ్నం చేసింది.

ఆమె సిరంజితీసి మందు ఎక్కించింది. పాంటు జేబులో నించితీసి యిచ్చాను. ఇంజక్షన్ చేయటానికి చేయిపైకెత్తింది. చేయి వణికింది. దృఢంగా పట్టుకుంది సిరంజిని. నేను క్రిందికి చూపు సారించాను. ఇంజక్షన్ చేస్తున్నది. "అబ్బా...నొప్పి" గొణిగాను. ఆమె ఎంతో సున్నితంగా చేసింది. దూదితో మర్దన చేస్తున్నది.

"ఈసూత్రానికే" ఆమె ముఖంలో చిరునవ్వులు చిందులాడాయి.

ఏం చెప్పాలో తెలియలేదు. ఒకచేత్తో నా చేయి పట్టుకొని మరొకచేత్తో దూదిమర్దన చేస్తోంది.

"అబ్బ! కదుములు చూశారా, రోజూ దూదితో మర్దన చేస్తున్నారా? కాపు పెట్టాలి" బాధగా చూసింది.

"లేదు" అన్నట్లు తలూపాను

ఏం అన్నట్లు చూసింది.

"ఇంట్లో పరిస్థితి బాగులేదు." వెంటనే నాలిక కరచుకున్నాను.

"కాపు పెట్టాలి. లేకపోతే కదుములు కడ్తయ్." చిన్నగా స్వగతంలా చెప్పుకుంది. "హోటల్ భోజనమా ?" విచారంగా అడిగేసింది. ఆశ్చర్యపోయాను. కొంచెం బాధపడ్డాను. నా విషయం యీమె కెలా తెల్సు ? అవునన్నట్లు తలూపాను. అది అయిష్టపు చిహ్నంగా నా కన్నుల్లో ద్యోతకమైన కించిత్ బాధకు ఆమె కనుకొనల్లో నీళ్ళు తిరిగాయి. దూది మర్దన అయిపోయింది.

"నొప్పి తగ్గిందా ?" మళ్ళీ ఆ నవ్వు వర్షించింది.

తలూపాను. బాధగా చూసింది.

"కాపు పెట్టాలి. అసలే బలహీనంగా వున్నారు. ఆరోగ్యాన్ని జాగ్రత్తగా చూసుకోవాలి"

ఏం మాట్లాడాలో తెలియలేదు చకచకా వెనక్కి తిరిగాను. బైటికొచ్చేస్తుంటే, వెలలేని వస్తువును పారవేసుకున్నట్లుగా బాధపడ్డింది మనసు. ఆమె యింత సేవకి కనీసం "థేంక్స్" చెప్పకుండా బైటికొచ్చాను. అందుకు నాలో నేనే బాధపడ్డాను.

* * *

"...చూశారా ! రాత్రయినా కాపు పెట్టలేదు. చూడండి ఎలా కదుములు కట్టినయ్యో. అసలు ఆ యింజక్షనే అంత! ఎంత బాగా చేసినా కదుము కడ్తుంది." ఇంజక్షన్ చేసి చేతిని ఎంతో చొరవగా, ఎంతో ఆప్యాయంగా మర్దన చేస్తూ అంది మన్నాడు.

ఈమె ఋణం ఎలా తీర్చుకుంటాను ? నేను యీామెకి ప్రతిఫలమేమివ్వగలను ? ఏమిస్తే సరిపోతుంది ? కొత్త ఊహ మనసులో దూసుకుపోయింది.

"అసలే బలహీనతలో ఆరోగ్యాన్నెందుకిలా అశ్రద్ధ చేస్తారు ?" జాలిగా నా వైపు చూసింది. ఈ దఫా తలవూపితే లాభంలేదని ఆ చూపుల అర్థం అనిపించింది. దీనంగా ఆమె వైపు చూశాను.

"ఇంట్లో పరిస్థితులు బాగాలేవు."

వెంటనే అంది : "ఏమైనా సరే మీారు ఆరోగ్యాన్ని గూర్చి తప్పక శ్రద్ధతీసుకోవాలి." ఈ తఫా తప్పలేదు. తల వంచుకుని స్వగతంలా చెప్పుకున్నాను "ఇది యీా వూరు కాదు. కాలేజీలో చదువుతున్నాను. రూంలో వుంటున్నాను. ఒకప్రక్క చదువూ, ఇవన్నీ సమకూర్చుకోవటం ఎంతో కష్టం."

"పోనీ ఒక వారం పదిరోజులు సెలవు పెట్టగూడదూ" ఆ గొంతులో ఏదో ఆవేదన వుంది. ఈ తఫా అప్రయత్నంగా అనేశాను "అక్కడ అన్ని అవసరాలు సమకూరుతాయనే ముంది ?"

ఆమె ముఖం తటపటాయించింది. జాలిగా చిన్నగా భయంగా అంది "అమ్మ లేదా ?" ఎంత మృదువుగా వుంది ఆ ప్రశ్న.

వెంటనే సమాధానం చెప్పాను. ఆప్తుల్ని హృదయం చెప్పకుండానే అర్థం చేసుకుంటుందేమో ! వాళ్ళు కన్పించి

నపుడు హృదయబాధని ఏకరుపెట్టి దానంతటదే ఆత్మశాంతి పొందుతుందేమో !

"అమ్మ చిన్నప్పుడే పోయింది. అమ్మలాగ సాకిన నాన్న క్రిందటి సంవత్సరమే నన్నొంటరిని జేసి యీ లోకాన్ని వీడాడు."

గత చరిత్రగాయం రేగటంతో నా కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నయ్. ఎందుకో అప్రయత్నంగా ఆమెకేసి చూశాను. ఆశ్చర్యం. ఆమె కన్నీరు కారుస్తోంది. నన్ను చూసి వెంటనే కళ్ళు తుడుచుకుంది.

"ఆప్తులెవరూ లేరా? ఇంకా పెళ్ళి..."

మధ్యలోనే అందుకున్నాను. "వంశానికి ఒక్కణ్ణే పుట్టాను. లోకపు అన్యాయానికి కుటుంబపు ఆస్తి ఆహుతైంది. ఒక్క అమ్మమ్మతప్ప ఎవరూ లేరు. ఉన్న యకరం సాగుచేయించుకుంటూ పూర్వపు యిల్లుని కనిపెట్టుకుని గడప లూడ్చి ఆమె జీవిస్తుంది. నాన్న బ్రతికుండగానే నా వివాహం చేయటానికి విశ్వప్రయత్నం చేశాడు. కాని కోరిక నెరవేర కుండానే తీరని బాధతో వెళ్ళిపోయాడు." ఒక్కసారి నా కన్నీటిగాధనంతా తల్చుకొని బావురుమని వాపోయాను మానవుడి సంతాపభారాన్ని దూరంచేసేది, విషాదభరితమైన ఏడ్పే కదా ! ఆమె కళ్ళవెంట అశ్రుబిందువులు ఏకధారగా కారుతున్నయ్.

ఆమె నా చేయిపట్టుకొని దీనంగా అంది "క్షమించండి! గడిచిన విషయాలడిగి మిమ్మల్ని బాధపెట్టాను."

జాలిగా చూసింది. ఆ చూపులో క్షమిస్తావుకదూ అన్న దీన మైన ప్రార్ధన వ్యక్తమౌతుంది.

ఏదో కొత్తధైర్యం, కొత్తఛాయిలు నన్ను పీడించినయ్.

"మీ రుణం తీర్చుకోలేను." బాధగా చూసింది. సైట కొద్దామని వెనక్కి తిరిగాను. బాధగా, భారంగా, బరువుగా ముందుకు అడుగేశాను.

"ఏమండీ మిమ్మల్నే?"

ఆమె నవ్వుతూ అంది "మీరే పేటలో వుంటున్నారు?"

"పాండురంగపురం, మొదటివీధి రామారావుగారింట్లో"

"రామారావుగారిల్లా." ఆమె ఉప్పొంగే ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని దిగ మ్రింగుకోటానికి ప్రయత్నించి విఫల అయింది.

భారంగా ముందుకు నడిచాను. చేయవలసిన పనుల భారంలో సైటికొచ్చి నడకనడిని వేగంచేశాను.

*　　*　　*

రాత్రి ఎనిమిదైంది. పడుకున్నాను. పరీక్షలు దగ్గర కొస్తున్నయ్. పరీక్ష ఫీజుకట్టాలి. కనీసం నాలుగు కథలు వ్రాయాలి. 40 రూపాయలు కట్టాలి. క్లాసు పుస్తకాలు చదుకోవాలి.

గదిలో గుడ్డిదీపం ఆరిపోయే ప్రాణిని జ్ఞప్తికి తెస్తోంది. దోమల మోతతో చెవులు చిల్లులుపడుతున్నయ్. ప్రక్క గదిలో భార్యాభర్తలు కుటుంబతగాదాతో సతమత మౌతు

న్నారు. ఎదురింట్లో చెక్క కోత మోత ఎడతెగకుండా, విరామం లేకుండా విన్పిస్తోంది. ఇంటివెనుక గోందుకప్పల బెకబెకలు ప్రపంచ ప్రళయానికి, చిహ్నమా అనిపిస్తున్నయ్. పంచలో తాత గురకనిద్రలో ఘూర్ణిస్తున్నాడు. చాపమీది అవ్వ మగతనిద్రలో "వెధవడబ్బు" కలవరింతలో పలవరించింది.

దూరాన పొగాకు కంపెనీలో గంట 9 మ్రోగింది. ఎంతకీ నిద్ర పట్టటంలేదు. తల బ్రద్దలు కొట్టుకుపోయే ఆలోచనలు చంచలంగా సంచరిస్తున్నయ్. భావనలపైన యమయాతనల జీవిత సాగరాన్ని దాట యత్నిస్తోంది విభావరిని పోలిన మనసు. గాఢాంధకారంలో నిశాకాంత నగ్నంగా నృత్యం చేస్తోంది. దూరాన, పొలాలలో కీచురాళ్ళ రకాలు, ఏకంగా అరిచిన, గొంతు చించుకొని ఎలుగురాసిన గళం పగిలేటట్టు అరిచిన నక్క అరుపు—ఏదో నిరాశా...ఏమిటో నిస్పృహా...ఏదో ఆఖరౌతున్న ధ్వని, ఏదో అంతమౌతున్న ధ్వని. హైటు రోడ్డుమీద త్రాగుబోతు అవ్యక్త, వ్యక్త పేలాపన విన్పించింది.

దగ్గరిగుళ్ళో "రామరామ హరేహరే" రామభజన ఆగి ఆగి విన్పిస్తోంది. ఎదురు చెట్టుమీద పక్షి గూడులో పాము చప్పుడు అర్థమైంది. రామభజనకు తాళంవేసే గుడ్లగూబ అరుపు, అప్పుడప్పుడు వినిపిస్తోంది. ఎక్కడో కుక్క మొరిగింది. తీతువుపిట్ట కలతనిద్రలో కలవరించింది. సమస్త ప్రపంచం మధుర విశ్రాంతి నొందుతూ విశ్వకర్త సుషుప్తి,

సమ్మోహనాస్త్రంలో ఉద్రూతలూగుతోంది. చీకటికాంతకు కారుమేఘం తోడైంది. విద్యుల్లత కొట్టిన ఉరుముల మెరుపుల కొరడా దెబ్బలకు నేస్తం, ప్రళయానికి ముందు ప్రజ్వరిల్లే, ఘూర్ణిల్లిన సప్తసాగరాల ధ్వనిని శబ్దాన్ని అరువు తెచ్చుకుని కేక పెట్టింది. కంకాళ కరాళ, కాళ రాత్రిని మింగటానికి ఆకాశం నోరు తెరిచింది. బ్రహ్మాండం బ్రద్దలయ్యే చినుకుల టపటప ధ్వని ఏకంగా ప్రారంభించింది. నరాలు కొంకర్లుపొయ్యే చలి మానవులమీద రాజ్యం చేస్తోంది. నా కలత నిద్రలో పట్టబోయే నిద్రని దూరం చేసింది, నరాలు కొరుక్కు తినే చలి మహమ్మారి.

పంచలో అన్న, తాత మంచాన్ని, చాపని పైకి లాక్కున్నారు. పొయిలో పడుకున్న కుక్కని అన్న పెద్దగా కసిరింది. వాన నా గదిలో జల్లెడ తీరులో ధారలు కారుస్తోంది. చాపని ప్రక్కకులాక్కున్నాను. అక్కడ వాన కురుస్తుంది, లాభం లేదని, మూలకీడ్చుకున్నాను. అక్కడ వాన నీరు వరదగా వుంది.

చివరకు చాపచుట్టి కూర్చున్నాను. ఆలోచించి ఆలోచించి క్రితమే అలసిపోయిన మనసు మళ్ళీ ఆలోచన ప్రారంభించింది. ఒళ్ళు మండిపోతోంది. తలనొప్పి బాధ నా జీవితంలో అనుభవించనంత ఎక్కువగా వుంది. దోమలు యిదే సమయమని, ఎండినవంట్లో వచ్చే కొద్దినెత్తురుని పీల్చుకుంటున్నాయ్. రెండు రోజులక్రితం తిన్న అన్నరసం డొక్కలో ప్రవహింప ప్రయత్నించి కడుపునొప్పిని అధికంగా కలగ

జేసింది. దాప్పటిలేని జీవితాన్ని. చలిదేవత "నీ అతిథివని, ఆశ్రితుడవు నీవేనని" నా ఒళ్ళంతా కావలించుకుంటోంది.

ఆలోచించాను. నా నిస్సహాయతకు నాకు నేనే జాలి చెందాను. విసుగువేసింది యీ భారమైన జీవితాన్ని యింకా శేషించటం ధరణికి భారమనిపించింది. కాని చేజేతులా నాదైనా, ఒక నిండు ప్రాణాన్ని హత్యచేసే అధికారం నాకేముంది? అంతరాత్మ ఆదేశించింది.

...ఆమె...ఆమె ... డాక్టరు ... హాస్పిటల్ ... మందులు...వైద్యం...ఆ చిరునవ్వు, మృదుమధుర పలుకులు—ఆ దీనమైన కరుణ నిలయమైన చూపులు...జ్ఞప్తికొచ్చినయ్. ప్రపంచంలోనిష్కల్మషమైన, స్వచ్ఛమైనప్రేమ ఆమెదగ్గర మాత్రమే గలదేమో! అచ్ఛమైన, స్వచ్ఛమైన మేలి ప్రేమ విలువ తెలిసినది ఆమె కొకెత్తెకేనేమో! తక్కినదంతా, విజ్ఞాన నవనాగరికత పేరుతో, చంచల సంచలితులు అవిశ్వాసజీవులు ఐన మానవులు తయారు చేసిన కృత్రిమ సౌందర్య, ఆటోప, పటాటోప, కపట, అభినయ బాహ్యాడంబర నటనా, క్షణిక, అనసర ప్రేమ మాత్రమే అనిపించింది. జగత్ స్వరూపిణి ఆదితల్లి స్వర్ణ అనురాగం ఆమెలోనే మూర్తీభవించింది.

ఏమో! ఏమో! అన్నీ ఏమో? అయోమయం అంధకారం, ఆమె ఎవరో, ఏం చేస్తుందో...ఎక్కడుంటుందో...ఎవ్వారో?...మొదట ఆమెని చూడగానే, ఎందుకో తనకు ఆమెతో ఏదో అవ్యక్త బాంధవ్యమున్నట్లనిపించింది! ఏదో

అనుబంధం! సంబంధం! ఆత్మీయత! అవ్యాజ అనురాగం మరి తన యీ చిన్న జీవితంలో, ఎందర్నో చూశాడు. కాని ఎందుకిల్లా అనిపించలేదు...ఎందుకు? ఏమో!

అంతా విశ్వకర్త ఐంద్రజాలం. ఆమెని చూడగానే ఏదో తరతరాల సంబంధమున్నట్లు తోచింది. ఆమె పరిచితే అనిపించింది. ఆనాడు తన మనో రంగంలో ఏదో మరుపు తెర పొర తొలగటానికి ప్రయత్నించి ఆగిపోయింది. అంతకు ముందు ఆమెని తను ఎక్కడో ఎప్పుడో చూశాడు. విచిత్రం! ఆశ్చర్యం!!

ఆలోచించాను...బుర్రబద్దలుకొట్టుకున్నాను. ఎంతకూ జ్ఞప్తిరాలేదు. పొరుగింట్లో కోడిపుంజు, లోకపు మేలుకొలుపు పాటగా "కొక్కొరోకో" అంటూ తన యథా విధి కర్తవ్యం నిర్వహించింది. నిర్ణీతకాలపు అలారపు గడి యారంకూడా కోడిపుంజులా తన విధి నిర్వర్తించదేమో!

వాన వెలిసిపోయింది. ప్రశాంత గంభీరత లోకాన్ని ఆవరించింది. ఆకాశంలో వేగుజుక్క తొంగిచూసింది. ఇళ్ళల్లో కలకలం రేగుతోంది. పనిపాటుల కార్మికులయిల్లాళ్ళు వంట చేయటం మొదలుపెట్టే వేళయింది. మనుషులందరిని ఏదో కొత్త ఉత్సాహం, ఏదో నవ్యత, ఏదో "కొత్త" ముందుకు నడిపిస్తోంది. సృష్టిలో విధి నిర్ణయ ప్రపంచ, పరి ణామ కాలకార్యక్రమ దినచర్యలో ఒకరోజు గడిచిపోతుంది. మళ్ళీ మరో రోజు ఏదో క్రొత్త, ఏదో నవ్యతతో మానవుల్ని నవజీవన ఆశాపూరితుల్ని చేసి తమ తమ విధిబద్ధుల్ని చేస్తుంది. పగలంతా "విరామ మెరుగక పరిశ్రమ జేసిన"

పారి శ్రామికులకు మధుర విశ్రాంతినిచ్చే, ఓనన్య మృత్యువే యీ సుషుప్తి. నిరర్థక ఆలోచనలో మనస్సు వేగిపోతోంది.

ఎదురు యింట్లో వున్న హిందీ పండితులవారు ఒక్కసారి యిల్లదిరిపోయేలా ఆలపించారు, ఉదయాన లేస్తూనే. "హేరాధా మాధవ్" అంటూ కృష్ణనామం మననంచేశారు.

ఆ...అదే...అదే...నే ఆలోచిస్తున్న విషయమే... నా మనస్సులో మసక తెర, మబ్బుతెర, మరుపు మడత తొలిగి పోయింది. ఒక్కసారి ఎనలేని సంతోషం కలిగింది.

అదే...అదే...రోజుల దొర్లికచేత నా మనోభూమి నుండి మరచిపోయిన నామం "రాధ" ఆమె...ఆమె పేరే, ముమ్మాటికీ ఆమే. గత కాలం ఒక్కసారి నామీద విరుచుకు పడింది.

పోయిన సంవత్సరం చివర విశ్వవిద్యాలయ ఎలక్యూషన్ పోటీలో మా కాలేజీ తరఫున నేను వెళ్ళటం! అదే విధంగా మెడికల్ కాలేజీ తరఫున ఎం.బి.బి.ఎస్. విద్యార్థిని రాధ రావటం—అన్నీ నా కళ్ళముందు గిరగిరా తిరిగినయ్. అప్పుడు రాధ జమిందారుగారమ్మాయని చెప్పారు. అప్పుడామె నాతో ఎంతో చక్కగా మాట్లాడింది.

ఆ పోటీలో నేను ఫస్టు ప్రైజు, రాధ సెకండు ప్రైజు పొందిన విషయం జ్ఞప్తికొచ్చింది. రాధ నా ఎడ్రసు తీసుకున్న విషయం ఇప్పుడే జ్ఞప్తికొస్తోంది.

వెంటనే వేసవి సెలవులు రావటం, తను అమ్మమ్మ దగ్గరకు వెళ్ళటం అన్నీ గుర్తుకొచ్చినయ్. ఇప్పుడు ఆమె రాధ కాదు...డాక్టరు...

*　　　*　　　*

కళ్ళు తెరిచి చూచాను. వాతావరణమంతా కొత్తగా వుంది.

"ఎవరు? నేనెక్కడున్నాను." సంకోచంగా ప్రశ్నించాను.

నాకిట్లో నవ్వుతూనే చెప్పింది. "మీరు హాస్పిటల్లో వున్నారు"

ఆశ్చర్యపోయాను. అంతా కలలాగా వుంది.

"నన్నెవరు చేర్చారు? ఎప్పుడు?"

"రాధాదేవిగారు నిన్న ఉదయం చేర్చారు." నర్సు క్లుప్తంగా చెప్పింది.

హృదయం ఆలోచనా పరంపరలతో నిండిపోయింది. ఎవరామె? నాకు ఆమెకు సంబంధం ఏమిటి? ఆమెకు నేనంటే ఎంత జాలి! ఆమె ఋణం ఎలా తీర్చుకోవాలి? ఎలా ధన్యవాదాలు చెప్పాలి? ఎలా కృతజ్ఞత చూపించాలి? ఆలోచిస్తూ పడుకున్నాను.

ఆమె పదింటికి నవ్వుతూ వచ్చింది. ఎందుకో అప్రయత్నంగా లేచి కూర్చున్నాను. నమస్కారం చెప్పాను. ఆమె చిరునవ్వుతో ప్రతి నమస్కారం ఆచరించింది. ఆమె ఎదురు

కుర్చీలో కూర్చుంది. ఆమె సంతోషంతో ఉప్పొంగిపో తోంది.

ధైర్యంగా ప్రారంభించాను. "మీ మేలు మర్చిపో లేను. మీ ఋణం తీర్చుకోలేను. మీ కెంతో ఋణపడి వుంటాను."

ఆమె నవ్వుతూ అంది "ఫరవాలేదు. ఈ చిన్న విష యానికే! విపత్తులో మానవుడికి మానవుడు సహాయం చేయటం ఆపద్ధర్మం. అదే నేను చేశాను."

ఎందుకో పొగిడేశాను: "మీరు కరుణా నిలయులు. మీలో కరుణ మూర్తీభవించింది.

పట్టరాని నవ్వును ఆపుకుంటూ అంది. "మీకు ప్రేమ మూర్తులైతె ఉండగా"...వాక్యాన్ని పూర్తి చేయలేకపోయింది.

"మీకు ప్రతిఫలం ఏ మివ్వగలను?" బాధగా చూశాను.

"ఓ మీకు..." ఆమె పూర్తి చేయకముందే అందు కున్నాను. "మీ ఋణం తీర్చుకోటానికి ఏం చేయగల్గినా చేస్తాను."

ధైర్యంగా అందుకుంది...వింటూ కూర్చున్నాను. "ఆ నాడు మొదట మిమ్మల్ని వైజాగ్‌లో చూసినప్పుడే నా హృదయం అంకితం చేశాను. ఆ నాటినుంచి మిమ్మల్నే ఆరాధ్య దైవంగా ఆరాధిస్తున్నాను. మొదట మీ రచనలు చదివేదానిని అవి మానవులకు అందించే నగ్నసత్యాన్ని

తెల్సుకొని ఉప్పొంగి పోయేదానిని. తరువాత మిమ్మల్ని, వైజాగ్‌లో ఎలక్ష్యూషన్‌లో పాట్లాడినప్పుడు చూశాక మీరు నా మనోమందిరానికి అధినాథులయ్యారు.

ఆనాడు యూనివర్శిటీలో మీ అడ్రసు తీసుకుని మిమ్మల్ని తరువాత కలవటానికి ప్రయత్నించాను. మీరు కొద్దిరోజులకే ఊరు వెళ్ళారని తెలిసింది. ఆనాటినుంచి ఎదురు చూస్తున్నాను.

మళ్ళీ యీ సంవత్సరం కాలేజీలు తెరిచాక, మిమ్మల్ని కలుసుకోటానికి ఎంతో ఆరాటపడ్డాను. ఏంలాభం? మీ క్లాసులో మిత్రులకు కూడా మీ అడ్రస్ తెలియక పోవటం ఆశ్చర్యం.

మొన్న హాస్పిటల్లో ఇది చివరి సంవత్సరం గానటం చేత (ఎం. బి. బి. ఎస్.) మేము ప్రాక్టికల్‌కి వచ్చినప్పుడు మిమ్మల్ని చూసి ఎనలేని సంతోషాన్ని పొందాను. ఆనాడు అడ్రసుచూసి మరీ ఆశ్చర్యపడ్డాను. మీరున్న యిల్లు, మా స్నేహితురాలు సరళ వాళ్ళది. మీరున్న గది యింతకు ముందు వాళ్ళ పశువులశాల. కొద్ది అద్దెకు మీకు ఇచ్చారు.

మీ గర్భదరిద్రం, పరువుబరువు, గబ్బిలాల ఆవాసం అందరికీ మీ నివాసం తెలియనివ్వలేదు. నాకు కూడా అడ్రసుయిస్తూ మీరు సంకోచించారు. కాని నేను అటువంటి వ్యక్తిని కాదు. 3 రోజులనుంచీ హాస్పిటల్‌కి రాకపోవటం వలన మీ విషయం సరళనడిగి తెల్సుకున్నాను. మీ గదిలో ఏదో మూలుగు విన్పిస్తున్నదని చెప్పింది. నా గుండె మండి.

పోయింది. వెంటనే వచ్చేశాను. మీ గది చూశాక మీ మీది గౌరవం నాకు రెట్టింపు అయింది. ఆ దుర్భర గర్భనిర్భేద్య దరిద్ర పిశాచానికి ఎదురు పోరాడుతూ గబ్బిలాల ఆవాసంలో నివాసంచేస్తూ, వస్తువులతో కుస్తీపడ్తూ పైప్రివేట్లతో కాలం గడుపుతూ, జీవితసత్యానికి, ఆశయానికి అనితర అవిరళ సంగ్రామంలో ఎదురునిల్చి, విరామమెరుగని పరిశ్రమతో స్కాలర్‌షిప్పులు తెచ్చుకుంటూ జీవిస్తున్న మీ జీవితం అందరికి ఆదర్శప్రాయమైంది. కష్టాలలో మీ ఓర్పు, మానవులమీద మీ దయ, చండ ప్రచండ బాధల్ని చిరునవ్వుతో సహించే మీ సహనం నా జీవితానికో నూతన వెలుగు నిచ్చినయ్. ఏనాడో మీకు హృదయం సమర్పించాను. ఇప్పుడు ప్రత్యక్షంగా..." మూగజీవపు రాతిప్రతిమ ముందు భక్తులు నివేదించే దండకంలా వింటున్నాను. ఆమె చెప్పి చెప్పి జాలిగా నా వంక చూసింది. ఆ చూపు దేహంలో శల్యాలని పరీక్షించే రేడియోగ్రాఫ్ (ఎక్స్‌రే) లా వుంది.

"మీరు అనేది..." నోరు పెగల్చి అనేశాను. ఆమె మధ్యలోనే అందుకుంది.

"క్షమించండి. ఇకనుంచి నన్నెప్పుడూ 'మీరు' అని సంబోధించవద్దు. నా పేరు రాధ. పేరున పిలవండి. దయచేసి నన్ను మీ అర్ధాంగిగా..." వాక్యం పూర్తిగాలేదు. ఆమె సంతోషంలో పరవశం చెంది ఆగిపోయింది. నా పైన గభీర దృక్కులు సారించింది. "రాధా! కయ్యానికి నెయ్యానికి సమవుజ్జీలుండాలన్నారు. నేను నీ అంతస్తువాణ్ణి కాదు. నాకు నీ అంత ఐశ్వర్యం లేదు..."

"స్వామీ! యీ అంతస్తులు, ఐశ్వర్యాలు క్షణిక అనుభూతులు కావా" ఆమె మితిమీరిన ఆనందంలో తనువును మైమరచిపోయింది.

"రాధా! వివాహానికి పెద్దల సమ్మతి..." ఆమె మధ్యలోనే అందుకుంది. "ఈ విషయం మానాన్న పూర్తిగా నాకు వదిలేశాడు. ఇంతకు ముందు నేను ఆయనతో ప్రస్తావించాను. నా యీ ఒక్క కోరిక మన్నించి నెరవేర్చండి."

"రాధా, అంత భాగ్యమా" సంతోషంతో నాహృదయం ఊగి పోయింది.

"కొద్దిరోజుల్లోనే మన సంబంధం వివాహంద్వారా పవిత్ర బంధంగా రూపొందుతుంది." ఆమె యీ మాటల్లో ఆనందం, హామీ కూడివున్నయ్.

"రాధా, నీలో ఏదో విశిష్టత వుంది. కనుకనే భగవంతుడు నాలాటి దీనునికి నిన్ను..."

"నేను సునిశితమైన శాస్త్రజ్ఞురాల్నిగాను, ప్రతిదానిని కార్యకారణ భావంతో పరీక్షించటానికి. నాది మూఢ భక్తి. దాంతోనే మిమ్మల్ని పొంద గలిగాను." సన్నగా గొణిగింది. భావాలు, మాటలరూపం దాల్చని లోకానికి వెళ్ళి పోయాయి.

— ౦ —

# భగ్నహృదయం

రైలుబండి పోతోంది. పిచ్చివాడి మనస్సులో నలే రఘు మనస్సులో స్థిరములేని ఊహాలు చంచలంగా సంచరిస్తున్నయ్. ఎంతో త్వరగా గమ్యస్థానం చేరాలనిపించింది రఘుకు. అయితే యేం? మనస్సు పోయినంత త్వరగా రైలు పోలేదు. విచిత్రమైన దీర్ఘాలోచనలలో సమాలోచనుడయ్యాడు రఘు.

విచిత్రమైన మానవ జీవితాన్ని అర్థంచేసుకునేటందుకు ఎందరో వేదాంతులు, గృహాలువదిలిపెట్టి, భార్యాబిడ్డలకు దూరులై ఘోరమైన అరణ్యాల్లో ఎండకుయెండి, వానకు తడిసి సుదూరయెడారులలో నడిరాత్రివిచిత్రమెరుపులు అరుపుల చరుపులలో పయనించి విషాదముఖముతో జీవితరహస్యాన్ని కనుక్కోలేక విఫలులయ్యారు. అంతు తెలియని, అంతు తేలని యీదీర్ఘయాత్ర అనంతమైంది. ఈ ప్రయాణంలో మానవ జీవి ఎండమావి దూరాన పారాడుతుంటే ఆశతో దాని నధిగమించటానికి అనుసరించే బాటసారి. ఈ అనంత జీవిత యాత్రలో యెన్నో లెక్కలేనన్ని, లెక్కతేలనన్ని సోపానాలు లోపాలున్నయ్. ఏ జీవి వాటన్నిటిని గడచి తిరిగిరాడు.

మానవజీవి యెక్కడనుండియెలాయిక్కడికి వచ్చాడు! ఎక్కడికి పయనిస్తాడు? ఎలా పయనిస్తాడు! ఎలా పయనించాలి? యిదే వేదాంతుల్నందర్నీ కలవరపెట్టే ప్రశ్న. ఈ మాయామేయ జగంలో యిదినాది, నాబ్రతుకిలా గడుపుతానని చెప్పగల్గిన మానవ జీవొక్కడులేడు. ప్రపంచంలో

యెన్నో మానవ బొమ్మలు మారిపోయినై. ఎన్నో మారిపో తున్నాయ్. ఇంకెన్నో మారబోతున్నాయ్. స్థిరముగ, శాశ్వ తంగా నిల్చేవేవీలేవు. జగమంతా గారడివాని పన్నుగడ. అంతములేని యీలోకం ఒక పాంథశాల. జీవితయాత్ర బాటసారులకు విశ్రాంతి గృహము. ఈ భువి చదరంగంలో మానవ పావుల్ని తెలుపు నలుపుగళ్లనుసూర్చిస్తూ విలాసంగా ఆడిస్తాడువిధియాటకాడు ఈ ప్రపంచ నాటక రంగంలో క్షణిక వేషం ప్రదర్శించి అస్తమిస్తారు మానవబొమ్మలు.

తొమ్మదినెలలు కానరిచీకటికోనలో శయనించి, ప్రస వాబ్దినితరించి "ఊఊ" లు రాకుండానే "ధారుణి పాఠశాల" కు వచ్చిన యీ వింతపరదేశి, జీవితమంటే యేమిటో తెలియ కుండానే యీలోకాన్ని విడిచి బాధ అంటే భయపడే యీ పిరికిపంద, 'దయ్యాలతో ఘూకంబులు చెరలాడే' శ్మశాన వాటికి వెళ్ళిపోతున్నాడు. అది అతడి ఆఖరిసోపానం. చివరి విశ్రాంతిగృహము.

ఈ జీవిని అనుక్షణము వెనుకనుంచి కదుపుతున్న దెవరు? ఇతని యిష్టాఅయిష్టాలతో పనిలేకుండానే యితనిచేత బలవంతంగా సుఖ దుఃఖా లనుభవింప జేసేదెవరు? అసలు యెవరైనావున్నాడా? వుంటే యెలావుంటాడు? ఇదే వేదాం తులందరికి తీరనిప్రశ్న. ఇదే వాళ్ళందరి తీరని కోరికై, ఆరని ఆశకోసం అశ్రులు చాపచేస్తుంది. దీనికోసమే ఏసాహిత్యా రాధకుడైనా కలంపట్టి యేశాస్త్ర శిల్ప ఖండినైనా, కళా

రూపంగా సమర్పించేది. దీని ప్రతిబింబార్థమే యేప్రతి సృష్టి కర్త అయినా జగశ్శిల్పిగా పేరొంది రాతిని నాతిగా మలచి పాషాణ ప్రతిమలకు పసుపుకుంకాల పూజ గల్పించేది.

"చావుపుట్టుకల పొలిమేరలలో" అర్థం తెలియకుండా నిలబడి యేదో అంతు తెలియని ఆవేశంలో విచిత్రభావ ప్రతిమ లనుచూసి యేదో అవ్యక్తమైన అనుభూతి పొందుతాడు మానవుడు. కలతనిద్రలో కన్పించే మధురస్వప్నాల్ని అర్థం లేని విచిత్ర భావకల్పనలతో అనుభవిస్తాననే యీ వెతల మయమైన బ్రతుకులో భారంగా దొగాడుతుంటాడు మానవుడు. "కనపడేది కనపడదని, కనపడుతుంది కనపడటంలేద"ని యేవేవో ఆలపిస్తారు యీ వేదాంతులు. వారి ఆలాపనలు వాస్తవిక జీవితంలో గాలి అలలలో ప్రేలాపనలవుతయ్.

ఈ 'అవని అక్షయపాత్రలో' అనుకునే వేవీజరగవు. కోరుకునే వేవీ దొరకవు. మానవుడు జీవులందరిలో ఉత్తము డంటుంది వేదాంతం. యేది? అతడి ఉత్తమత్వం యెందులో ఔన్నత్యం పొందింది? అతడెప్పుడూ స్వేచ్ఛాజీవి అంటారు. ఎక్కడ అతడిస్వేచ్ఛ. కర్రకు కత్తుల సంఘపు యినుకుబోను లో అతడన్నిచోట్ల ఖైదీ ఏమో అన్పిస్తుంది.

అప్పుడే కరుణమూర్తి అరుణ కిరణాలు సోకి అప్పుడే అరవిచ్చిన కలువ అందం అది పొందే ఆనందం మానవుడిలో వుందా? జలజలా, గలగలా ప్రవహించే తెల్లటి నిర్మల సెల యేటి రొదలోపలి ఆ సంగీతం మానవుడు పాడగలడ ? పచ్చ

పచ్చటి చెట్లమీద, చిరుగాలికి రేగిన చిగురుటాకులలో విరామమెరుగక, విసుగు జనింపక తిరిగే పసిడి రామచిలుకల పారవశ్యం మానవుడు పొందగలడా? తనే గాక తన విరహవేదనతో ఋతురాజును సైతం కదిలించి కరిగించివేసే ఆదర్శ ప్రేమమూర్తి కోకిలచేసే వీణావాణి మానవుడు పాడగలడా? నవ వసంతంలో చిగురాకుల గుసగుసలు మానవుని కేనాటికైనా అర్థమవుతాయా? నాడు పౌర్ణమిరోజు, కడలరేడును చూసి వుప్పొంగే సాగరకన్యలో చెలరేగిన ఆనంద ప్రణయ భావాల విరిగే తరంగాలు, కడలిలో చెదిరి అదిరి నిస్పృహతో విశ్రమించే కెరటాల ప్రమోతలు మానవుడు ఊహించగలడా? ఊహ చేయగల్గుతాడా? ఏనాటికైనా ఉప్పొంగగల్గుతాడా? ప్రసిద్ధ నయాగారాలాటి సుప్రసిద్ధ లయబద్ధ శబ్ద లావణ్యం, ఆ రమణీయత మానవుడు మరొకచోట సృజించగల్గుతాడా? తనేగాక వాతావరణాన్నంతటినీ పులకింపచేసే నెమలి నృత్యంలో పొందే సంతోషం, దాని నోట సంగీతం మరోవిధంగా పొందగల్గుతాడా? సంజకెంజాయలలో "అంబా" అని అరచే లేగదూడలకు వాటి పొదుగులనిచ్చి ఆప్యాయంతో ఆదరించే ఆవుపెయ్యల మాతృప్రేమ, ఆ స్వర్ణమమత మానవుడిలో వుందా! ప్రకృతిలో తరులు గిరులు యిచ్చే పరోపకార బోధ మానవుడు ఆచరిస్తున్నాడా? అరుణమూర్తి పూర్వదిక్సతి, ఆ మధురప్రభాతాన్ని పడమటి దిక్సతి సుధా ప్రదోషాన్ని మానవుడు సృష్టింపలేడు ఎందులో మానవుడు

అన్ని జీవులకన్నా అధికుడు? ఇంకా అనుక్షణమూ బాధలలో, భయములతో, మోసాలతో, ద్రోహాలతో, ఈర్ష్యాసూయలతో సతమతమౌతూ కటకటపడతాడు. ఇది అన్నిజంతువుల కన్నా అతడి హైన్య స్థితి.

ఆలోచిస్తే, ఏమీ తెలియదనుకొనే, "బాటసత్రవేల ముల్లోకములు చూచి లోలోన ఆనందపడే నోరులేనియోగి" అమాయక చక్రవర్తి పసిపాప పాలబుగ్గలపైన వెల్లివిరిసే ఆనందం మానవానుభూతిలో లేదు. ఇక ఎందులో మానవుడి మేధస్సుయితర జీవులకన్నా ఆధిక్యతపొందింది?

రఘు ఆలోచిస్తూనే వున్నాడు రైలుదారిప్రక్క స్టేషన్లలో ఆగిపోతుంది. వేదాంతమంతా మిథ్యే, అదంతా మానవుల్ని సంతృప్తి పరచటానికి చెప్పిన ఓ కల్పితమైన భారమైన స్వప్నమే అనిపించింది. రఘుకు అతని హృదయాంబరమందు ఆలోచనా మబ్బులు చెదిరిపోయినై. ముఖమందు నిస్పృహ గోచరించే స్వేదబిందువులు కాపురం చేస్తున్నవి. జీవితమే ఒక సుఖనందన వనమనే యీకవుల వ్యాఖ్యానాలు సుఖస్వప్నా మానవజీవి దుఃఖసాగరమందు ఒడ్డు తెలియని బాటసారని నిర్ధారించుకొన్నప్పుడు రఘు బెదరిని ముఖం భీతితో కపించిపోయింది. నిరాశ నిస్పృహలతోనిండిపోయింది.

బైట మబ్బుపట్టి కారుమేఘాలు ప్రళయ నాట్యంచేస్తున్నవి. మెరుపుల ఉరుములకు చెవులు తూట్లుపడుతున్నవి. గాలివాన ప్రారంభమైనది. రైలుకూడా వణికిపోతున్నట్లు లయబద్ధమైన అడుగువేస్తూ నడకసాగిస్తూంది.

రఘు హృదయమందు అజ్ఞానం వెర్రితలలు వేసింది. దుఃఖం పెల్లుబికి వస్తుంది. బైట ఆకాశమందు కారు మేఘాలు క్రమ్మినట్లు రఘు హృదయాంబరంలో కారుభావాలు, తెరలు తెరలుగా, అరలు అరలుగాపుట్టి నశిస్తున్నవి. రఘుకు మానవ జీవితమంతా 'అజ్ఞాన తిమిరాంధకార పంకసంకలిత' మని పించినప్పుడు అతని నవనాడులు క్రుంగిపోయినవి. తన యీ యాత్రకు తుది లేదనిపించినపుడు పదములు కదలవని పిం చింది.

వేదాంతులంతా కోర్కెలను చంపి వేసుకోవా లం టారు. మానవ జీవితం అవసరావృత్తమై వున్నపుడు కోర్కె లను చంపివేసుకోవటం మానవ జీవికి సాధ్యమా? కోర్కెలు, ఆశలు లేకుండా మానవుడు క్షణం జీవించగలడా? మానవుడు నిశ్చలమైన మనస్సుతో, అర్ధనిమీలత నేత్రాలతో, నిరాశ నిస్పృహ చెందక, నీరసపడక, దేవుడ్ని మనస్సులో ధ్యాని స్తూ బ్రహ్మపదం కోసం నిరీక్షించాలంటారు.

'శోక తమోవృత శూన్యలోకమున' మనోనిశ్చలత ఎలావుంది. ఏమో, అది తన అనుభవానికి దూరమేమో. అందరికి ఏదో కొంత సుఖానుభూతి లేకపోతే తనలా అం దరూ విషాదకడలిలో పడిన నడపటానికి తెడ్లులేని తెరువరు లైతే ప్రపంచమందు క్షణం వుండగలరా?

సరళలాగే; చిన్ననాడే తల్లి పోయిన దురదృష్టవంతు డతను. తను మనసారా ప్రేమించి, తనహృదయాన్ని సమ

ర్పించి, దుఃఖ భూయిష్టమైన తనజీవితాన్ని 'ఆనందమయ ఆర్ణవం' చేసుకోవాలనుకుని సరళకు తన హృదయాన్ని బాల్యానే అంకింతం చేశాడు. ఆమె తన్నే ఆరాధ్య దైవంగా పూజించింది. ఏనాటిమాట పట్టింపువలనో తన్ను సరళనుండి వేరుచేసి, నాన్న తనప్రణయ జీవిత ఆరామంలో సృష్టించు కొన్నభావ పుష్పాల్ని త్రుంచివేశాడు. సరళ తండ్రి తన మేన మామ అయికూడా సరళని మాట పట్టింపుతో తనకు గాకుండా చేశాడు! అంతా విధి విలాసం !

సరళ తండ్రి పట్టుదలతో దేశోద్ధారకుడు, శ్రీరాం బాబు డాక్టర్ని వివాహమాడింది. మొదట బలవంతంగా పెండ్లాడినా, రాంబాబు మంచితనంతో సరళ హృదయాన్ని చూరగొన్నాడు. అతను నీరసమైన శరీరంతో, ఉదారబుద్ధితో దీనమానవుల సేవే మాధవ సేవనిచాటి, ఆతురాల అను సరించిన అమరమూర్తి. సరళ తన జీవితంలో సుఖదేవతను పట్టుకోగల్గింది. తనకు లేకపోయినా, సరళ సంతోషంచూచి ఉప్పొంగి పోయాడు తను. తల్లిలేని బిడ్డ, సరళని విధి అన్యా యం చేసింది.

తనకు జీవితంపై నిరాశవేసి ప్రేమ వైరాగియై, విచా రంతో జీర్ణించిన తనవుతో భారంగామోస్తున్నాడు తను వుని. కానీ విధి సరళకు అన్యాయం చేసింది. రాంబాబు ఒక దీన మానవుడి ఆపరేషన్ కేసునందు, ఓ నిశాంతాన ప్రశాం తాన్ని పొందే లోకానికి వెళ్ళిపోయాడు.

అంతా ఆరునెలల్లోనే విధి విచిత్రమైన ఆట ఆడాడు. సరళ జీవిత సంవత్సరంలో మధుర వసంతం అంతరించి గ్రీష్మ ఋతువు ప్రవేశించింది. ఆమె నిర్మల మనోసరోవరంలో మొలకలెత్తిన భావపద్మాలు మంట మండే మార్తాండుడి చండాతపంతో మాడిపోయినై.

ఆనాడు తను చూచిన సరళస్వరూపం యీనాటికి తన మనస్సులో మెదుల్తోంది. ఆమె సుందర సుకుమార వదనం విషాదంతో నిండింది. ఆమె సుందరమైన చెక్కిళ్ళు వాడి మైన వేడికన్నీటితో వాడిపోయినై. ఆమె విశాల నేత్రాలు గుంటలుపడినవి. దేహం నీరసంతో శుష్కించి పేలగా పాలి పోయింది. ఆమె శోకమూర్తి, పతివెడలిన పతివ్రతా శిరో మణి యశోధరిని పోలివుంది.

తనుగాకపోయినా ఆమెఅయినా సుఖపడ్తుందని సం తృప్తి పడ్డాడు తను. తన జీవితంలో ఎన్నో మధుర ప్రభా తాలు, వర్ణనాతీతమైన, వసంతాలు, మధుమధురమైన కోకిల కూజితాలు, చిగురాకుల గుసగుసలు, తను అనుభవించ కుండానే దొర్లిపోయినై. తనజీవితవ్యథ ఒకకథగా వ్రాయొచ్చు. సరళ కొంత అనుభవించిన అసంతృప్తి ఆనందంతో ఓ భగ్నవీణ అయింది. ఆమె జీవిత వీణమీద తీగ తెగి అప శ్రుతులు పల్కింది. వాడిన పువ్వులా ఆమె జీవితం వాడి పోయింది.

ఇంత చిన్నవయస్సులో ఆమెకింత కఠినశిక్ష విధించిన విధాత కరుణ రహితుడైన కసాయివాడు కావచ్చు. కాని

ఆమె స్వరూపాన్ని చూచిననాడు తన మానస సరోవరంలో మధుర ప్రభాతం తొంగిచూచింది. గడిచిపోయిన వసంతం తిరిగి తనమనస్సులో అంకురించింది. వాడిన ప్రోడైన తన వడలి వాడిపోయిన జీవితం తిరిగి చిగురించ ప్రయత్నించింది. బీటలు వారిన తన జీవితానికి తొలకరి జల్లుతగిలి మేను పులకరించినట్లుంది. తను సరళని అర్ధాంగినిగా స్వీకరించి ఆమె జీవితానికి న్యాయం చేకూర్చాలనుకున్నాడు. తన బాల్య ప్రణయాధిదేవత తిరిగి కలుస్తుందని, లేని ఆశ జీవితంమీద మొలకలెత్తించుకున్నాడు. అందుకే యిప్పుడు నుంచున్న విధంగా సరళ యింటికి వచ్చేస్తున్నాడు.

రైలుబండి మందమందంగా వాన హోరులో ఆగి ఆగి పోతోంది. రఘు చిన్ననాటి జీవితం మనస్సులో మెదుల్తోంది. తను, సరళ చిన్ననాటినుంచి కలసీ మెలసీ తిరిగారు. మేనమామగారి ల్లవడంతో తను సరళ వాళ్ళింట్లో వుండేవాడు. సరళ మామయ్యగార్కి ఒక్క తేకూతురు. గారాబుపట్టి. సరళతోపాటు తను కావాలసిన సరదాలన్నీ మారాము గారాబాలతో తీర్చుకొనేవాడు. తనూ సరళ ఒక కంచంలో తిని, ఒక మంచంలో పడుకునేవారు. అలాగడచింది తనబాల్యం సరళతో.

పదోఏటినుంచి తనజీవితం కొత్తపంథాలో నడిచింది. సరళ, తను అన్నంకూడా మానేసి ఎక్కడెక్కడో తిరిగేవారు.

అర్ధరాత్రి తెల్లటి చల్లని వెన్నెలలో తిరుగుతూ అవ్యక్తానుభూతి పొందేవారు. ఎక్కడో ఆర్తనాదంచేసే కీచురాళ్ళ రవాలకు చెవులు అప్పగించేవారు గంటల కొలది. తీతువుపిట్టలు తమనే హేళన చేస్తున్నయని బాధపడేవారు.

విరసినపూల సౌరభాల్ని మోసుకువచ్చే మంద వాయువులు వీచే మధు ప్రభాతాన్ని ఒక్కటికూడా తాము చవిచూడకుండా పోనిచ్చేవారు కాను. పూలతోటలో 'ఆకులో ఆకునై పూలలో పూవునై' గడిపేవారు. సంజ కెంజాయలలో అర్ధం తెలియని సంజకేసి విచిత్రంగా చూచేవారు. పచ్చపచ్చని పైరు ప్రాంత మంతా తమ కేనన్నట్లుతిరిగేవారు. దూరానకన్పించే కొండవనసలకేసి తదేకంగా చూస్తూ లీనమయ్యేవారు. విడిపోని విడబోని అమరమైత్రిగా భావించేవారు తనులేత హృదయాలలో.

రఘుఆలోచిస్తూన్నాడు. ఫస్టుక్లాసుకంపార్టుమెంటు కావటంతో నిశ్శబ్దం గోడలు కడ్తూంది. ఆలోచించి, ఆలోచించి రఘు మనస్సు అలసిపోయింది. చిన్ననాటి మధుర ఘడియలు మనోరంగమందు మెదలగానే రఘు హృదయం పారవశ్యంతో పరవళ్ళు త్రొక్కింది. బైట వాన విపరీతంగా కురుస్తోంది—ఎక్కడా కాకిగూడా కన్పించటం లేదు. రఘు దిగవలసిన స్టేషన్ వచ్చింది. ఆలోచనలతో సతమతమౌతున్న రఘుకు అప్పడే స్టేషన్ వచ్చిందని వినగానే, తిరిగి తిరిగి వేసారిన తెరువరికి తను విశ్రమించిన అగుగుర్కక్కనే గమ్యస్థానమని తెలిసినప్పుడు కల్గినంత సంతోషం కల్గింది.

రైలుదిగి టిక్కెట్టిచ్చి, బైటికొచ్చి స్టేషన్ చూరు క్రింద నిలబడ్డాడు రఘు-బైటవాన ప్రకృతిని తారుమారు చేసింది. ప్రకృతిలో గాలివాన, భోరున గాలి వీచేచప్పుడు చెవుల్లో ఆవాసం చేస్తున్నయ్. పిడుగులు, ఉరుముల మ్రోతలు వీనులకు కఠోరంగా, నివాసం చేస్తున్నయ్! ఇంకా మబ్బులు తారు రంగుని కోల్పోలేదు. జోరున వాన కురుస్తూనే వుంది.

రఘు కాసేపాగి విశ్రాంతి తీసుకుందా మనుకున్నాడు-మరుక్షణంలో అతని హృదయం నిరాశతో నిండిపోయింది. అయినా తనకు విశ్రాంతేమిటి! తుది మొదలు లేని యీ యాత్రకు అంతమేమిటి! ఇప్పుడు రైల్లో పయనించాడు - ఇక ముందు కాలినడకన పయనిస్తాడు. మానవజీవి దశల మార్పు అది పయనించే దారుల్ని మారుస్తుంది. అంతకన్నా ఏముంది! అయినా తనేమైనా పిరికిపందా? వానకు భయపడటానికి, ఆగటానికి. తను వెళ్ళే కల్పవృక్షం కోసం యింకా ఆలస్యమా? తన ప్రణయారాధ దేవతా పూజకు కాలమిప్పటికే అతిక్రమించింది. ఆ ప్రణయ దేవతని కల్సుకునేవరకు, పూజించే వరకు, తనకు శాంతి, ప్రశాంతి, విశ్రాంతి వుండవు.

అప్పటివరకు దారుణ భీషణ అవిరళ సమరం ప్రకృతి మీాదైనాసరే జరపవల్సిందే. దూరాన ప్రచండ జలపాతపు ధ్వని స్పష్టంగా విన్పిస్తోంది.

ప్రళయ భీకరమైన నడిగళ్ళ వానలో బయలు దేరాడు రఘు. గాలివాన తన ప్రళయ నాట్యంతో సుత్తెక్కిన రాక్షసిలా విజృంభించింది. రఘు నడకనడిని వేగంచేశాడు. స్టేషన్‌కు పల్లె రెండుమైళ్ళు. రఘు బయల్దేరినప్పుడు స్టేషన్ నుండి చూసిన ప్రయాణీకుల ఊహాలు ప్రస్తుతం అప్రస్తుతం.

రఘు కానలు, కోనలు దాటిపోతున్నాడు. తోటలో ఆశతో యనుపాశాన్నెదిరించి జీవిస్తున్న అవ్వ గుడిసె గాలి వానా పిశాచికి ఆహుతై కూలిపోయింది. గుడిసె యాదు ఏ ముందో ? గుడిసెచుట్టూ నీళ్ళు కట్టు కట్టినయ్. రఘుకు ఆ పేద శవాన్ని తీద్దామనిపించింది. అనుక్షణంలో, ఎవరైనా భూగర్భ నిద్రితులు కావలసిందే కదా, అని తన విధిలో లీన మయ్యాడు - రఘు ముందుకు నడిచాడు, ప్రక్క చెట్లన్నీ పిల్లల్ని కోల్పోయిన తల్లుల్ని జ్ఞప్తికి తెస్తున్నయ్. నాటి సుందరమైన సుకుమార అందమైన పత్రాల్ని హరించి వేసింది గాలివాన పిశాచి. ఒక చెట్టు తొర్రలో నివాసం చేసే ఆడ పక్షి చనిపోయి క్రింద నీళ్ళలో తేల్తుంది. పైన మగ పక్షి విరహ వేదన ప్రాణప్రియ నిరహితులను జ్ఞప్తికి తెస్తుంది. నీళ్ళలో ప్రాకులాడుతూ మొగపక్షిని తినటానికి చర చరా చెట్టు ఎక్కుతుంది కొండచిలువ. దాని ఆకటి మంటకు ప్రతి జీవి ఆహుతి కావల్సిందే. ప్రకృతితోనే భువన భర్త ఎంత విచిత్రాన్ని గల్పించాడు! ఒక తోటి జీవిపైన నురొక జవి కెంత యీర్ష్య! ఎంత పగ! దూరాన పాము నోట్లోకప్ప భారంగా మూల్గింది.

ప్రక్క పిల్లకాలువలు పొలాలలో హలాలకు విపా దాన్ని మిగిల్చి, సారమంతా అరగకోసుకొని గట్లన్నీ తెగ త్రెంచుకొని పెద్దకాలువనందు కలుస్తున్నయ్. దూరాన పారే సెలయేళ్ళు, వేగంగా నడిచే రైలుబండ్ల వేగాన్ని అతిక్ర మిస్తున్నయ్.

గాలివాన హోరు తగ్గింది. అప్పటికి బహుశా ప్రకృతి మీద దానికి జాలివేసి వుండవచ్చు. రఘు అచంచల దీక్షకు గాలివానే ఓడిపోయినట్లుంది. ఊరు దాపుకు వచ్చింది; ఊరి దగ్గర కోనేటిలో కొబ్బరికాయ ఊడిపడి నిర్మలమైన కోనేటి నీటిని కలత పర్చింది. రఘు హృదయం కలత పడింది.

రఘుకు తడిసిన బట్టలతో చలి అమితంగా పుడు తోంది. అయినా పట్టుదలతో తన దారిలో లీనమయ్యాడు. చెట్ల కొమ్మలనుండి నీళ్ళు రాలి భూదేవిని గుంటలు జేస్తున్నవి.

చేపలు నీటిలో సయ్యాట లాడుతున్నయ్. చిరు కప్పలు తమ విరోధాలైన గోండ్రు కప్పల సంగీతంలో తమది విన్పించనందుకు ఈర్ష్యపడుతూ మూల్గులు సాగిస్తున్నయ్. అక్కడక్కడ వానపాములు మొరకలమీద దిగాలుగా మం దంగా ప్రాకుతున్నవి.

నీటికుంట ఒడ్డుమీద గ్రోండుకప్ప అధిక రోధతో చనిపోయింది. దాని తోటికప్ప అధికంగా కన్నీరు కారుస్తూ దుఃఖిస్తుంది. ఇంతలో వాన, పాపం ఏమీ లేదని, కంట నీరు కారుస్తూవచ్చి కప్ప కళేబరాన్ని తన గర్భంలో జీర్ణించు

కుంది. దారుణ విషాద దృశ్యం చూచిన జంటికప్ప భీతితో దూరంగా పరుగెత్తింది.

రఘు మానసం క్రుంగిపోయింది. దిగులుగా నడక సాగించాడు. రఘు ఆలోచనలతో ఇంకెంత దూరమూ అని కళ్ళు ఎత్తిచూస్తే అపరిమితమైన సంతోషం కల్గి సరిగ్గా నుంచున్న ప్రక్కనే మామయ్య వాళ్ళిల్లని చర చరా వీధి గుమ్మంలో అడుగుపెట్టాడు.

ఆకాశంలో అక్కడక్కడ కారుమబ్బులు విచ్చిపోయి తెల్లమబ్బులు వచ్చి చేస్తున్నయ్. ప్రక్కయింట్లో రేడియో రికార్డు విన్పిస్తోంది. 'నీకోసమే నే జీవించునది' విరహాభిమన్యుడు ప్రణయ శశిరేఖ కోసం ఆలాపిస్తున్న విరహగీతం. రికార్డును మరో రికార్డు అనుసరించింది. "జగమేమాయ–బ్రతుకేమాయ!" విహ్వల ప్రేమికుడు దేవదాస్ మనోరంగం రఘు కళ్ళముందు సాక్షాత్కరించింది.

చలి వణుకు పుడుతోంది. గుమ్మం తలుపులు మూసి వున్నాయి. తెరుద్దామని త్వరత్వరగా తలుపుల దగ్గరకి వెళ్ళాడు. లోపల భీకరమైన వాగ్వివాదం జరుగుతోంది. అది తన జీవితాన్ని గురించే. రఘుకు తలుపు తెరవబుద్ధి కాలేదు. అక్కడ చూరుక్రింద నిలబడ్డాడు. చలి శరీరాన్ని కరుస్తున్నా, తల బాధగాయున్నా, కాళ్ళు తేలిపోతున్నా అంత బాధనీ ఓర్పుతో ఓర్చుకొని లోపల సంభాషణ శ్రద్ధగా వింటున్నాడు. లోపల్నుంచి సంభాషణ చిన్నగా వినిపిస్తోంది. మామయ్య అంటున్నాడు:

'రఘుచాలా అనాయకుడమ్మా! నీ భర్త పోయాడని అతడు ఎంత చింతపడ్డాడో. మొన్ననే రమ్మని ఉత్తరం వ్రాశాను. బహుశా యీ రోజు రావాలి ఈ గాలివాన ఇలా వుంది. వాడైనా వస్తే నీ మనస్సు శాంతిస్తుందేమో.'

రఘుచాలా బుద్ధిమంతుడు నాన్నా. నా దురదృష్టం ఆనాడు వాళ్ళ నాన్న......

'అదేమిటమ్మా అలా కంటతడి పెట్టుకుంటావు? ఏదో తెలియనివాళ్ళ పట్టుదలలు. పాపం తల్లిదండ్రీ వెళ్ళిపోయారు. రఘుఏకాకి. వాళ్ళమ్మ నా చేతిలో చేయి వేయించుకుందమ్మా, తప్పక నిన్నిచ్చి వివాహం చేయమని ...కాని...'

'విధివ్రాత...మనమేంచేస్తాం నాన్నా! తప్పక రఘుని ఒక యింటివాణ్ణి నీవే చెయ్యాలి నాన్నా.'

'అమ్మా!'

'ఏమిటి నాన్నా!'

'నీవు కరుణిస్తే!...'

'అదేమిటి నాన్నా! రఘుబాగుపడటం కంటే నాకింకేం కావాలి?'

'అది కాదమ్మా...అది జాలిపడి ప్రతివారూ చేసే పని. నీవు......'

'ఏమి చెయాలి నాన్నా?'

'నీకు ఈ చిన్న వయస్సులో యీ కఠిన శిక్ష నేను చూడలేనమ్మా. ఇది నాకు భరించరాని బాధని కల్పిస్తుంది.

నీవు రఘుని వివాహం చేసుకొని చిలుకా గోరువంకల్లా ఆనందపడుతుంటే మీ ఆనందం పంచుకోవాలని వుందమ్మా!'

'నాన్నా!' సరళ భోరున ఏడ్చిన యేడ్పు రఘు గుండెల్ని చీల్చివేసింది. రఘుకు తన చిరకాల వాంఛ మామయ్య కోరినందుకు సంతోషం ఉప్పొంగింది. అతడి హృదయం పౌర్ణమిరోజున పూర్ణచంద్రుని చూచిన కడలిలా పొంగి పోయింది.

అప్పుడే పైన కాకులగుంపు రోదిస్తూ లేచిపోయింది. దూరాన గుళ్ళోవున్న గుడ్లగూబ సంగీతంపాడించింది. పైగా ఉత్తీతుపిట్ట భయంకర భీకర భవిష్యత్ శకునం విప్పించింది. రఘు చలిబాధని దూరంగా త్రోలి వింటున్నాడు. సరళ యేడుస్తూ అంటుంది:

"నాన్నా, నేను వ్యక్తిత్వంగల స్త్రీని. నాకు వివాహం జీవితంలో ఒకసారే. ఆ స్వర్గద్వారాలు నాకెప్పుడో మూసుకు పోయినై. అనుక్షణం నానేటుకోరే మిమ్మల్ని జన్మాంతరాలకు కూడా మరువలేను. నన్నిలా బ్రతకనివ్వండి. మీరెంత బాధ పడుతున్నారో పితృహృదయం నేను అర్థ చేసుకున్నాను. నేను యిప్పుడు రఘుమీదచూపే ప్రేమ కేవలం సోదరి ప్రేమ మాత్రమే. నన్నిలా బ్రతకనివ్వండి"

సరళ భోరున యేడ్చింది. ఊరు మ్మా... యేదో... మామయ్య ఓదార్చుతున్నాడు.

రఘు నెత్తిన కారురాతిబండ పడినట్లుగావుంది. అతనికిప్పుడు ఆలోచించే శక్తిలేదు. తను ప్రణయదేవతగా పూజించిన సరళమీదవున్నాపేది సోదరిప్రేమా! తను యిన్ని కష్టాలు గడిచి భీకరంగా ప్రకృతితో పోరాడి వచ్చిందిదేనికేనా? ఇదేనా తన జీవితఫలం ... సుఖం. ఇంతేనా తన జీవితం. ఇక 'తనకు ఉగాదులు లేవు; ఉషస్సులు లేవు. ఉషస్సురాకకోసం వేల్చే హవిస్సు యిక తన కంటపడదు.

రఘుకు కళ్ళు తిరుగుతున్నయ్. అతన్ని యేదో అజ్ఞాతశక్తి చంపుకుతింటోంది. సముద్రం పొంగినట్లు, భూమి కృంగినట్లు, మిన్ను విరిగినట్లు యేదో ప్రళయ మొచ్చినట్లని పించింది. తన జీవితకావ్యంలో యిదే ఆఖరి అధ్యాయపు చివరిపుట అనుకున్నాడు.

"సరళా"...రఘు గొంతుచించుకొని అరిచిన అరుపు యింట్లో మానవగుండెల్ని చీల్చివేసింది. ఒకసారి బైటకి పరిగెత్తారు. రఘు తన గమ్యస్థానం చేరాడు..

సరళ రఘు గుండెమీద చేయిపెట్టి చూసింది. సరళ తండ్రి నిర్నిమేషదృష్టితో చూస్తున్నాడు. సరళ ఒక్కసారి కేక పెట్టింది. 'రఘూ వెళ్ళిపోయావా?' గుండె ఆగిపోయింది.

ఎప్పుడొచ్చాడో. యీపాపిష్టిదాని కర్కశపలుకుల శాపాలకు ఎంతబాధపడ్డాడో ... కుమిలిపోయాడో ... సరళ ఏడుపు శూన్యాన్ని చీల్చివేసింది. సరళ తండ్రి నరసింహమూర్తి గారి హృదయం కట్టలు తెంచుకున్నదిలా రోదిస్తోంది. 'హా! భగవాన్! యింత లేత వయస్సులోనే యెందుకీ కఠిన శిక్ష? యీ లేతముఖపు ప్రశాంతత వున్నట్లేవుంచి, నిశ్వాసాన్ని తీసుకొని హృదయ సంచలనాన్నాపి రఘు జీవిత ఆశ్వాసాన్ని పూర్తిచేశావా?' నరసింహమూర్తిగారు గొణిగిన అస్పష్టపు పలుకులు, విషాదాశ్రువులు సరళ రోదనలో లీనమైనై...లోకాన్ని నల్లమబ్బులు కమ్మివేసినై.

—o—

# జీవిత నావ

ఊరిలోకి పేరుమోసిన వేంకటరంగాచార్యులు తన ఆయుర్వేద పుస్తకం ముందుపెట్టుకొని మందుల్తో పరుగెత్తుతున్నాడు. ఇంతలో తన పెద్దకొడుకు రవి పరుగెత్తుకుంటూ, రొప్పుతూ రోజుతూ వచ్చాడు రంగాచార్యులగారి గదిలోకి.

"ఏమిటి బాబూ అలా పరుగెడుతున్నావ్! పరుగెత్త కూడదమ్మా."

"ఆఁ...నాన్న...మరే...మరే...లక్ష్మివాళ్ళ అమ్మ లక్ష్మికి గుడ్డలుకొంది. నాకుకూడా కొని పెట్టవా?" అంటూ మారాం మొదలెట్టాడు ఆ అమాయకపు పసిపాపడు.

"ఓ...నీకు ఒకటిగాదమ్మా, రెండు మూడు తెస్తాగా రేపు బజారు వెళ్ళినప్పుడు. అది సరేగాని బాబు, 'లక్ష్మి' ఎవర్రా?"

"లక్ష్మి మన ప్రక్క-యింటివాళ్ళ అమ్మాయిలే" అంటూ ఆడుకోవటానికి పరుగెత్తాడు రవి.

ఆయుర్వేదం ఎంతో దీక్షతో చదువుతున్న రంగాచార్యులు 'లక్ష్మి' పేరు వినగానే రెండశ్రుబిందువులు రాల్చాడు. ఎంత శ్రద్ధగా చదువుదామన్నా బుర్రకెక్కటంలేదు. ఆయనదృష్టి గడిచిపోయిన జీవితాన్ని తిరగవేస్తోంది తన యీ ముప్ఫయ్యేళ్ళ జీవితంలో ఎప్పుడో జరిగినదాన్ని తల్చుకొని కుమిలి కుమిలి కృశించటంమాత్రమే అతనికి తెలుసు.

అది జరిగి రెండేళ్ళవుతుంది. తలుచుకుంటే ఇప్పుడు స్వప్నంలా కనిపిస్తోంది. రంగాచార్యులు, వాళ్ళ అమ్మ, భార్యలక్ష్మి బదరీవెళ్లారు. అప్పటికే లక్ష్మికి నలుగురు పిల్లలు. నలుగురుపిల్లలూ పదేళ్ళలోపు వాళ్ళవటంచేత ఇంటి దగ్గర మామయ్యవాళ్ళకు అప్పజెప్పి పోయారు. వాళ్ళకు ప్రమాణకాలం ఇంకావుంది కాబోలు! లేకపోతే వాళ్ళవెంట తీసుకెళ్ళేవాళ్ళే! విధిదాట ఎవరివశం? బదరీచూచి వచ్చే టప్పుడు నది దాటటానికి పడవెక్కారు. విధి వ్యతిరేకించింది. నడి నదిలో తుఫానురేగింది. గాలి అధికంజేసింది. పడవ గుండంలోకి దూసుకుపోయింది, బ్రద్దలైంది! ఎవరివిషయం వారే! అంతే!

ఎవరికివారు ప్రాణతీపితో శాయశక్తులా ప్రయత్నిం చారు ప్రాణంతో బయటబడటానికి. రంగాచార్యులు ఇంకా ఇద్దరితో తోటియాత్రికుల బోటుయొక్క ఒడ్డు చేరారు. తక్కినకొందరు బోట్లలో ఒడ్డుచేరారు. కాని లక్ష్మి, రంగా చార్యులతల్లి, మరికొందరు నదీగర్భంలో లీనమయ్యారు. కర్మానుసారం కావల్సిందే! విధి ఎంత నిర్దయగలది!

దిగులుతో కృంగి కృశించి ఇల్లుజేరిన రంగాచార్యులు మంచంపట్టాడు. కనీసం మాతృవిహీనులైన తన బిడ్డల కొఱకైనా బ్రతకాలని, పెద్దవాళ్ళ ధైర్యోక్తులతో, మనో వ్యాధిని వదలి భారంగా జీవితాన్ని మోస్తున్నాడు!

అది తల్చుకున్నప్పుడల్లా ఆకలి వేయదు. ఏదో మనో వేదన అధికమౌతుంది. 'నాతొఊత్తు లక్ష్మి' అని చెప్పదగిన తన లక్ష్మి తనకు దక్కకుండా పోయింది. ఎంత దురదృష్టం.

విధి అన్యాయం చేసిన ఆ బిడ్డల్ని, ఆ దీన పసిపాపల్ని తను కూడా అన్యాయం చెయ్యకూడదనుకున్నాడు. అందుకే ద్వితీయ వివాహప్రయత్నం మానేశాడు. వచ్చే సవతితల్లి ఎలాంటిదౌతుందో! ఏమో! దైవమేగాక తనూ అన్యాయం చేసిన వాడవుతాడు. అందుకనే ఒక మంచి దాసినిపెట్టి తన బిడ్డల్ని సాకుతుంటూ వైరాగ్యసూచనలతో, ప్రపంచంతో తనకు పనిలేదన్నట్లు, లోకవ్యవహారాలకు దూరంగావుండి ప్రవాసిగా ప్రశాంతంగా బ్రతుకుతున్నాడు! ఆ బిడ్డలను చూస్తేచాలు అతనికి కడుపు నిండుతుంది. ఆ అమాయకపు పసిపిల్లల చిఱునవ్వే అతన్ని బలవంతంగా జీవింపజేస్తున్న ముఖ్యమైన మందు. దిక్కులేని ఆ పసిబిడ్డలకు ఆ భగవంతుడే దిక్కు. ప్రపంచంలో యీలాంటి ధీరులు ఎందరు భారంగా జీవిస్తున్నారో! వారందరికి ఆ భగవంతుడే దిక్కు.

ఆలోచనా విచార పరంపరలతో కళ్ళు నీరునింపు కొన్న రంగాచార్యులు రవి రాకను చూడనేలేదు.

"నాన్నా, లక్ష్మికి వాళ్ళ అమ్మ రెండు చొక్కాలు కొంది. నాకు నాల్గు కొనాలి" అంటూ వస్తున్న రవిని జూచి త్రుళ్ళిపడి లేచాడు రంగాచార్యులు. కళ్ళనీరు తుడుచుకొని "అలాగే నాన్నా" అంటూ చిరునవ్వుతో రవి నెత్తుకొని ముద్దాడాడు.

"నాన్నా ఏమైనా పెట్టన్నా?" అని దీనంగా అడిగిన రవి నోటిమాట రంగాచార్యులకు శూలంగా గ్రుచ్చుకొన్నది. రెండు చాక్లెట్లు చేతులో పెట్టాడు.

రవి పట్టరాని సంతోషంతో చాక్లెట్లు తీసుకొని "అక్కా నాకు చాక్లెట్లు" అంటూ పొరుగింటికి పరుగెత్తాడు, ఆటకొరకు పాపం! ఆ అమాయక పసిహృదయానికేం తెలుసు వాళ్ళ నాన్నపడే భాధ.

ఆ పసివాడి చిరునవ్వునిచూస్తూ సర్వాన్నే మర్చి పోయాడు రంగాచార్యులు. "దిక్కులేని దీనులకు దేవుడే దిక్కు" అని వ్యాఘోషించిందతని అంతరాత్మ.

—o—

# ఊహలు - అపోహలు

"అదుగో పులి! అంటే ఇదుగో తోక" అంటారు పల్లీయులు!

నాకు మరీ ఆశ్చర్యం వేసింది! ఏమంటే ఎంతో ఆప్యాయంగా పలకరించే వారంతా అమాంతంగా మూతి బిగించారు! చిరునవ్వుతో పలకరించే స్నేహితులంతా మొఖం తప్పిస్తున్నారు!! ఏ రచ్చబండ దగ్గర చూచినా గుసగుసలు ఎక్కువయ్యాయి! నా ఖర్మం ఏమిటో! నేవెళ్ళే టప్పటికే గుసగుసలన్నీ ఆపేస్తారు! మొఖం తేలవేసి చూస్తారు! ఇంకా కొందరు నన్ను చూసి కేకరించి వుమ్మివేయటం కూడా మొదలుపెట్టారు!!

ఇది ఏమిటా అని మొదట కకమక పడ్డాను! ఏమీ అర్థంకాలేదు! ఏమర్థమాతుంది!! ఎవరికివారు మూతిబిగిస్తే!!! ...ఏది ఎలావున్నా నాకేమిటి అవసరం! అసలే నాకు ఈ కల్లబొల్లి పల్లీయులంటేనే అసహ్యం! ఏదో మామయ్యగారు ఉన్నారు గనుక వెళ్ళాను! లేకపోతే అసలు ఎందుకు వెళ్తాను!

ఈసారి పల్లెకొచ్చినపుడు యింత అమాంతమైన మార్పు చూసేటప్పటికి నాకే ఆశ్చర్యం వేస్తోంది! సరే ఎలావుంటే నాకేం!! యీ హఠాత్తు మార్పుకూ నా ఆశ్చర్యానికి మేరలేదు!

సాయంత్రం షికారు బయల్దేరాను, పచ్చపచ్చని పైరులతో పల్లెప్రాంతమంతా ప్రపూర్ణ ప్రకాశవంతమై ప్రజ్వ

లిస్తుంది! చెరువులో పక్షుల - కిలకిలలు; కోయిల - కులు కులు, చిలకల - పలుకులు; నీటి అలల మలుపుల నలపులు; చేపల మిలమిలలు భూనక్షత్రములులా — మనోహరముగ, హృదయ వినోదముగ వున్నై! రాజు రక్తరేఖలలో రమ్యముగ రాచక్రీడ లాడుచున్నాడు!

ఎప్పటివలె మిత్రబృందం సమావేశమై బాతాకాని కొడ్తున్నారు! ఒకడు తెగకోసేస్తున్నాడు కోతలు! తెచ్చుకున్న విత్తనము (బఠాని) లతో కాలక్షేపం చేస్తున్నారు. నేనూ సఖ్యత్వం పుచ్చుకుందామని వెళ్ళాను! వెళ్ళానేగాని, ఎప్పుడూ ఎంతో ఆప్యాయంతో పలకరించే స్నేహితులంతా మూగనోము పట్టారు!

వీళ్ళతో నాకెందుకని చెఱువు మరగొమ్మకు వెళ్ళాను! ఈత ముగించి ఒడ్డుకు చేరాను! ఏకాంతం సహించలేదు. పక్షులు గగనకుసుమములై నివాసంకు చేరుకొంటున్నై. కష్టజీవులు కలకలతో యిండ్లముఖం పట్టారు. సూర్యుడు పడమటి కనుమలకు జారుకొంటున్నాడు. చెఱువంతా బంగారు ఛాయతో నిండిపోయింది. సమీపములోవున్న చెట్లన్ని బంగారు ఆకులతో బంగారు కాయలు కాస్తున్నై. చీకటి క్రమక్రమేణ అలుముకొంటూంది. చలిదేవుడు గిలిగింతలు పెడ్తున్నాడు. పిల్లగాలులు మెల్లమెల్లగా చల్లచల్లగా స్పృశిస్తున్నై. లోకాన్ని అంతుతెలియని గంభీరత ఆవరిస్తుంది. చెఱువుకట్టమీద రావికొమ్మపై గుడ్లగూబ చెవిగోసుకున్న నక్కలా మొరపెడ్తూంది.

"రాగమయీ రావే! అనురాగమయీ రావే! అప్రయత్నంగా ఆలాపించాను. చెఱువు ఆదర్ని కూర్చున్న మా మిత్రబృందం ఇంటిముఖం పట్టారు. ఇప్పటివరకు వాళ్ళదగ్గరే కూర్చున్న పుల్లయ్యతాత ఎవరు లేకపోవటంచేత నావైపు నడుస్తున్నాడు. చూచిచూడనట్లుగ నాప్రక్కగా వెళ్ళిపోతు న్నాడు. నిజంగా నన్ను చూడలేదేమో అనుకొని "యేం తాతయ్యా బాగున్నావా?" అన్నాను. ముడుచుకొన్న ముఖం అలానేవుంచి "బాగానేవున్నా బాబూ నీ దయవలన!" "అదేమిటి తాతా యిందులో నాదయేముంది? అంతా ఆ భగవంతుడి దయ."

"ఆఁ ... యీకాలపు పిల్లలకు దేముడుండాడా బాబూ?"

"పూర్వమున్న దేవుడు యిప్పుడు ఎక్కడికి పోతాడు తాతా?"

"ఆ ... ఏమోబాబు. ఇప్పుడు దేముణ్ని పూజించే దెవరు? ఎంతసేపూ ప్రేమ...ప్రేయసివే...యనీ బొమ్మల పూజేసరిపోయింది. ఇక దేముడేం కానొస్తాడు! ...... నాకేం తెలుసుబాబూ? అంతా నీకే తెలియాలి. వత్తా బాబూ. వత్తా."

ఎంతో ఆదరంచూపి, ఆప్యాయంతో పలుకరించే తాతయ్యలో యీ హఠాత్తు మార్పు నాకేమీ అర్థంకాలేదు. ఏదో రెండు మాటలుచెప్పి ముభావంగావెళ్ళిపోయాడు. ప్రేమ...ప్రేయసి...దేవుడులేడంటాడు. ఏమిటిది? మా మిత్రబృందం మూగనోము, ముసలితాత ముభావం, నాలో

రక్తాన్ని వేడిపర్చాయి. నేనంటే వీరి కెందుకింత అసూయ, ఈర్ష్య? ఎందుకు పలకరు? పలుకరించరు? వీరినేమన్నాను. ఏంచేశాను? వచ్చి రెండు రోజులుకాలేదు. నేను వీరికేం అపకారంచేశాను? ఏమో వెధవలోకం. ఎలాపోతేనాకేం_ అనుకొంటూ ఆలోచనా పరంపరలతో ప్రొద్దుగూకిపోయిం దని కూడా మర్చిపోయాను. కట్టదిగి ఫ్యాక్టరీతోవపట్టాను? ముందుఎవరో మనిషి వెళ్తున్నాడు. గబగబా నాలుగు అంగల్లో వచ్చి కలిశాను.

"ఏమండీ! మీ అబ్బాయి సుశీలరావు ఫ్యాక్టరీకి వెళ్ళా డట - ఎప్పుడొస్తాడండీ?"

"రేపొస్తాడు బాబూ! ఏం పనీ?"

"ఆ...ఏమీలేదూ! ఫ్యాక్టరీకనే అడిగాను."

"అది సరేగాని బాబూ! పెద్దవాడిని నీతో ఒకవిషయం చెప్తాను, కోప్పడవుగదా! ఆ విషయం ఫ్యాక్టరీవారంతా మీ మామయ్యకు ఇంతకుముందే చెప్పి వుంటారు! నేను నీ మేలు కోరేవాణ్ణి కనుక చెప్తున్నాను! శ్రద్ధగా విను."

ఎప్పుడూ యీ రకంగా మాట్లాడని వెంకటాద్రి గారి యీ వింతధోరణిచూస్తే గుండెపగిలిపోయింది. ఫ్యాక్టరీవారంతా మామయ్యకు చెప్తారట! నామేలు కేనట ఏమిటో యిదంతా!

"కోప్పడటం యెందుకండీ. చెప్పండీ తప్పకుండా వింటాను"

"ఆఁ...యేమీలేదుబాబూ! మీరు దేవుడు పాటలు పాడుకోనక యీ సినిమాపాటలు యెందుకు? అది చెడు

సహవాసంలభింపజేస్తాయి. చెడుఅలవాట్లువస్తాయి.మీరువాటిని నేర్చుకోగూడదు."

నామనస్సు చిరాకెత్తింది. వళ్ళు కంపరమెత్తింది. ఇంతగా యేదో చెప్తాడనుకొంటే యిదేనా యీతనిచ్చే అమూల్యమైన సలహా వ్రాకికే! సినిమా పాటలు పాడినంత మాత్రాన చెడుసహవాసం, చెడుఅలవాట్లు వస్తాయా ఏమిటి? ఈవింతధోరణిమామయ్యతో చెప్పేదేమిటండీ? నాకేమీఅర్థం కానటంలేదు మీరుచెప్పేది. "అన్నాను.

"మాబోటివాళ్ళు మంచిగాచెప్తే అర్థంకాదులేబాబూ అనుభవిస్తే తెలుస్తుంది.నన్నడగటమెందుకు,యేమీ తెలియని వాడిలా మీ మామయేచెప్తాడులే పో, అంటు చిరాకుగా త్వర త్వరగా వెళ్ళిపోయాడు వెంకటాద్రిగాడు.

"నాకేమీ పాలుపోవటంలేదు. యేమిటీ గోల మిత్రు లందరు పలకరు. పుల్లయ్యతాత ప్రేమ,ప్రేమసీ.బొమ్మలపూజ అంటాడు. ఈ వెంకటాద్రిగాడు చెడుసహవాసాలు, చెడు అలవాట్లు అంటాడు. యేమిటే వీరంతా అనేది, అనుకొనేది? యెందుకు వీరంతా నాతో పలకరు? పలుకరించరు? యేమో వెంకటాద్రిగా"ని యెందుకు ప్రశ్నవేద్దామనిపించింది. చిన్న ప్పుడు చదువుచెప్పిన పంతులుగారే యీయన. అది జ్ఞాపక మొచ్చేటప్పటికి కూడబెట్టుకున్న ధైర్యమంతా బేజారై జారిపోయింది. ఇక మామయ్య నడగటం అసలే అసంభవం. ఇదే ఆలోచనతో యింటికి చేరాను.

"అమ్మా! బాబు! బ్రతికేంరా దేవుడా యీనాటికి, అనుకున్నాను" ఏం తప్పుచేశానో! మామయ్య ఏమం

టాడో అనుకోని భయమెత్తింది! మామయ్యలో మార్పేమి కనిపించకపోయేసరికి ధైర్యమంతా కూడబెట్టుకొని భోజనం చేసి నిద్రాదేవికి వశుడైపోయాను.

ఉదయం 8 గంటలకు నౌకరొచ్చి నేలొ్కల్పాడు. "ఇది బస్తీగాదు, పల్లెటూరు! ఇప్పటిదాకా ఎవరు పండుకోరు! మామయ్య పిలుస్తున్నారు! త్వరగా వెళ్ళండి" అని అన్నాడు. మామయ్య పిలుస్తున్నాడనగానే గుండె నీరైంది. ఎప్పుడూ నాతో పనిలేని మామయ్య ఇంత త్వరగా రమ్మంటున్నా డెందుకు ? ఏమో ! గుండెల్లో గుండెలు లేవు. రక్తం త్వరగా ప్రవహిస్తోంది!! గుండెల్లో రైళ్ళుపరుగిడుతున్నాయి. మెల్లగా అడుగులో అడుగు వేసుకొంటూ పిల్లిలా వెళ్లాను.

అయింది, నేననుకున్నంత అయింది! కొందరు ఊరి పెద్దలు, మా మిత్రబృందం మామయ్యతో మాట్లాడు తున్నారు. కొందరి ముఖాలు కోపంతో ఎర్రగా ఉన్నాయి. మిత్రబృందంలో కొందరు చిరునవ్వు నవ్వుకుంటున్నారు. మామయ్య నవ్వుతూ మాట్లాడటంచూచి, పోయిన ప్రాణం లేచివచ్చింది.

"ఏంరా, నిన్న రత్నంవాళ్ళింటికి ఎందుకు వెళ్ళావు?" అని మామూలు ధోరణిలో అడిగాడు మామయ్య.

"వాళ్ళివ్వవలసిన డబ్బు నాన్న యిప్పించుకు రమ్మన్నాడు. అది అడగటానికి వెళ్ళాను."

నేనామాట చెప్తుండగానే మా మిత్రబృందంలో ఒకడు "కాదండి అబద్ధం! రత్నంతో చెతుర్లాడుతున్నాడు. మాట్లాడుతుంటేనే చూశాను." అన్నాడు.

నాకు నవ్వూ, అసహ్యం. కోపం మిళిత మయ్యాయి. "అదికాదు మావయ్యా, వాళ్ళింట్లో వాళ్ళ నాన్న లేడట! అందుకని రత్నంతో మాట్లాడాను.! వాళ్ళ నాన్న డబ్బివ్వమని రత్నానికి చెప్పాడట! డబ్బిచ్చింది. ఇదిగో!" అంటూ రత్నం యిచ్చిన 50 రూపాయిలు చూపించాను.

"నేను చెప్పలా మావాడు అలాంటివాడు కాదని" అని నవ్వాడు మావయ్య.

"అదికాదండి, ఎంత చదువుకుంటే మాత్రం మాల దానితో కులకట మేంటి? పోనీ అది అబద్ధమంటే యీ యీాడు కుర్రవాడు ఆ పెళ్ళిగాని కమల దగ్గరకు వెళ్ళొస్తాడా? దానికేం పెళ్ళి కాఅక్కర్లా? మగవాడుకనుక పీడు తెగిస్తే మటుకు? వాళ్ళు కాస్త పసువు, ప్రతిష్ట కలవాళ్ళే" అన్నాడొక పెద్ద మనిషి.

ఈసారి నిజంగా మావయ్యకు కోపంవచ్చింది "ఏమిటయ్యా నువ్వనేది? ఇప్పుడు మేమేనా అంత పసువు, ప్రతిష్ట లేనివాళ్ళం? ఎమైనా ఋజువుందా?"

"నేను చూశానండి, మొన్న మీవాడు రాత్రి 10గం టలకు కమల వాళ్ళింటి కెళ్ళొస్తుంటే"

"ఏంరా, నిజమేనా యిది?" అన్నాడు కోపంతో గద్దిస్తూ.

"అదికాదు మావయ్యా! సుశీలారావు దగ్గరకు చదువుకుంటానికి వెళ్ళాను. వాడి పుస్తకం కమల తమ్ముడు 'రవి' దగ్గరుంటే, నేను, సుశీలారావు, 'కమల' వాళ్ళింటికెళ్ళి పుస్తకం తెచ్చుకొన్నాము"

ఇంతలో పూరినుండి వచ్చి, సుశీలారావు నాకోసం వస్తూనే ఈ కథంతా బయటనుండి విని "యేమిటండీ మండి పోతున్నారు. అవును మే మిద్దరం కలసి'కమల' వాళ్ళింటికెళ్ళి పుస్తకం తెచ్చుకొన్నాము. ఇది నిజమేనండి" అన్నాడు.

ఆమాట వింటూనే వచ్చినవాళ్ళు వంచినతల ఎత్తకుండా జారుకున్నారు.

"అదుగో పులీ! అంటే, ఇదిగో తోక!_అన్నట్లు పల్లె వాళ్లే అనిపించారే" అని మామయ్య పెద్దగా నవ్వి పూరుకున్నాడు.

—o—

# అసమర్థుడు

స్టేషన్‌లో గడియారం రాత్రి తొమ్మిది కొట్టింది. పగలంతా అలసి అలసి పనిచేసిన గోపీ దీర్ఘమైన నిట్టూర్పు విడిచి బైట రోడ్ మీదికి వచ్చాడు. పగలంతా విరామంలేని ప్రయాణంతో బాధపడిన రోడ్లన్నీ కాస్త కాస్త విశ్రాంతి తీసుకుంటున్నయ్. వీధిలో వెల్గుతున్న మునిసిపల్ దీపాలు, ఏదో ఘోరం చూడలేని మనిషి ముఖం వెలవెల పోతున్నట్లు అర్ధకాంతితో వెలుగుతున్నయ్. వీధి చివర కొడిగట్టిన దీపం, పోబోయే ప్రాణికి ఆశే జీవితశ్వాస- అని నిరూపిస్తోంది.

పగలంతా క్షణం విశ్రామంలేకుండా ఆఫీస్ పనిలో లీనమైన గోపీ మనస్సు పరిపరివిధాలా ఆలోచిస్తోంది. విశ్రామంలేని యీ నిర్జీవమైన బ్రతుకు నిరర్ధకమనిపించింది.

నడుస్తున్నాడు. ఎంత నడిచినా బాట అంతంకావటం లేదు. మనస్సులో ఆలోచనలు ఎడపెడగా సంచరిస్తున్నయ్. తనుకన్న కలలన్నీ గాలి అలలేమోననిపించింది గోపీకి. తన చిన్నతనంలో ఎన్నో కలలుకన్నాడు. ఎన్నో పిచ్చిక గూళ్ళు కట్టాడు. కాని లాభం! శూన్యం! ఒకటీ ఆచరించి అనుభవించలేకపోయాడు.

గోపీ ఒక్కసారి కాలం నడిచినబాటలో 15 యేళ్ళ వెనక్కు వెళ్ళాడు. బలవంతంగా కాలం మానవుల్ని మెడ బట్టుకు ముందుకునడిపిస్తుంది. కాలప్రవాహాని కెదురీదటం మానవ సాధ్యంకాదు.

అమ్మ వ్యధఅంతా ఒక కథ. అది ఆమె చెప్పి నప్పుడు తన గుండెలు తరుక్కు పోయినై.

తను ఎంతో దురదృష్టవంతుడు. తను పుట్టగానే గుండె జబ్బుతో ఎదిరించి పోరాడుతూ. జీవితమంతా గుమస్తా గిరిలోనే గడిపివేసిన నాన్న తన కోసమే జీవించినట్లు, ఆయన పని అయిపోయినట్లు, హఠాత్తుగా వెళ్ళిపోయాడు. కటిక దుర్భర దారిద్ర్యంలో మగ్గిపోతూ, నికృష్టంలో ఉక్కిరి బిక్కిరవుతూ జీవితమంతా బాధలతో గడిపిన అమ్మ ఒక్కతే తనకు నాన్న మిగిల్చిపోయిన ఆస్తి.

చుక్కానిలేని నావనుపోలిన అమ్మ తనకోసమే భారంగా, నీరసంగా, సుఖాలకు దూరంగా, బలవంతంగా జీవించింది.

నాన్న పొయ్యేనాటికి తమ యింట్లో మిగిలిందొక్కటే లేదు, ఆయన రోజూ బస్తీనుంచి తమ పల్లెకువచ్చే జీర్ణిం చిన పాత సైకిలుతప్ప. నాన్న పోగానే ఆ సైకిలు అమ్మి కర్మకాండ వెళ్ళబుచ్చారు ఊరి పెద్దలు. రెక్కలతో నిల బడింది అమ్మ.

నాన్న మిగిల్చిన పల్లెలోపలి పూరికొంప నాన్న పోగానే అమ్మివేసింది అమ్మ. అంత దుర్భర దారిద్ర్యంలో కూడా ఏనాడూ ఒకరి గుమ్మమెక్కి ఒకరిని యాచించి ఎరు గని అమ్మ యీ బస్తీలో ఒకరింట్లో పని చేయటానికి కుదిరింది.

ఇల్లు అమ్మిన రెండు వందలు తన జీవిత సర్వస్వంగా వుంచి తన్ను బడికి పంపింది. అమ్మకు తనంటే పంచప్రాణాలు. తను బడికివెళ్తే వచ్చేవరకు ఆమెఆత్మ తన చుట్టూనే వుండేది.

అంత బీద పరిస్థితిలో కూడా తనకు మూడు పూటలా చక్కగా పెట్టేది. కంటికి రెప్పలా చూసేది. ఆమె పస్తున్న నాడుకూడా తనకు ఏరికోరి పెట్టేది. అందరికన్నా మిన్నగా తనకు బట్టలు కుట్టించేది. అందరి అబ్బాయిలకన్నా మిన్నగా వుండాలని ఆకాంక్షించేది.

తనకు కొంచెం జ్వరం తగిత్తే భోరున శోకాకులయ్యె పది మంది వైద్యులదగ్గరకు తిరిగేది. ఆమెకొచ్చినా బాధ పడేదిగాదు. తనకు తలనొప్పి వచ్చిననాడు ఆమె పస్తే. మానవ రూపదేవత. మాతృశ్రీ అమ్మ ఋణం వెయ్యి జన్మలెత్తినా తను తీర్చుకోలేడు...అనురాగంలో, ఆప్యాయంలో, ఆదరంలో గడిచింది తన బాల్యం.

కాలచక్రం జీవిత పథాలమీదగా దొర్లిపోయింది. తనకు 10 వ ఏడొచ్చింది. ఉన్నవాళ్ళ పిల్లలంతా హైస్కూల్లో చేరుతున్నారు. తనూ చేరాలి. మరి తను దరిద్రుడు. దాసీపుత్రుడు. అమ్మ ఏవిధంగానూ సంకోచించలేదు. ఆలోచించకుండా బళ్ళో చేర్పింది. తనకు బట్టలు, పుస్తకాలు జీతాలు, అందరికన్నా మిన్నగా వచ్చేవి. ఎలా వచ్చేవో తనకు తెలియదు. ఒకనాడు రాత్రి పన్నెండింటికి నిద్రలేచాడు తను. అప్పుడు అమ్మ ఇంట్లో మిషన్ కుడ్తున్నది. ఆశ్చర్యం.

"అమ్మా ఇంత రాత్రా? ఇప్పుడే మెచ్చిందమ్మా నిద్ర పోకుండా" అమాయకంగా అడిగేశాడు.

"అయ్యో నువ్వులేచావా పడుకో బాబూ. మళ్ళీ వేకువ ఝామునే హోటల్ పనికి వెళ్ళాలి. యింకా రెండు కొత్త యిళ్ళు ఒప్పుకున్నాను పనిచేయటానికి. నీకు బట్టలు, పుస్తకాలు..." ఏమేమో చెప్పింది.

తనకు దుఃఖం పెల్లుబికింది. ఫలితం శూన్యం. తను ఏంచెయ్య గలడు? ఏంచేస్తాడు? నోటమాటరాలేదు. దుప్పటి కప్పుకు పడుకున్నాడు.

అలా గడిచింది తన విద్యార్థి జీవితం. అమ్మ ఒకొక్కప్పుడు రెండు, మూడు రోజులు పస్తులు పడుకునేది. తనకు మాత్రం సంతుష్టిగా పెట్టేది, కోరిన బట్టలిచ్చేది. ఎప్పుడైనా "అదేమిటమ్మా అన్నం తినలేదని' అంటే 'తిన్నానులే'. అంటూ ఆ ప్రస్తావన మార్చేసేది. తనకు ఎన్నో బుద్ధులు చెప్పేది. ఎంతో బోధచేసేది. "పేదవాళ్ళ మీద దయగల్గి వుండాలనీ మానవసేవే మాధవసేవని' లోకోక్తులు నల్లె వేయించేది.

అందరితో "మావాడు ఎంతో బుద్ధిమంతుడు. వాడు ఏ కలెక్టరో చేస్తాడు. నేనిప్పుడెంత కష్టపడ్డా వాడు నన్ను బంగారపు ఉయ్యాల్లో పెట్టి ఊపుతాడు. వాడికన్నా నాకేం కావాలి. నేతింటేనేం: తినకపోతేనేం" ఆవిధంగా వుండేవి ఆమె మాటలు.

రాత్రింపగళ్ళు పనిచేయటంతో అమ్మ ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. తనకు తెలియకుండగాని ఆమెలో ఏదో అగ్నిపర్వతం, ఏదో తీరని వ్యథ ఆమెని దహింప చేస్తుండేది. కాని ఏనాడూ తన లేత మనస్సుకు అసంతృప్తి కలగనిచ్చేది కాదు.

ఆమె ఎప్పుడూ ఏదో అమూల్యమైన, వెలలేని కొన లేని వస్తువును పోగొట్టుకున్నట్లు బాధపడుతూన్నట్లుండేది.

కాలం వింత వింతగా గంతువేసింది. తనకు మంచి రోజులొచ్చినై. ఎస్. ఎస్. ఎల్. సి. మంచి మార్కులుతో పేసైయ్యాడు. ఆనాడు అమ్మ సంతోషానికి మేరలేదు. అంద వాడేక లెక్చరర్ చేస్తాడు. నాజన్మ ఫలించింది. నా చిరకాల వాంఛ నెరవేరింది. నేనిక నిశ్చింతగా నిద్రపోతాను" అని యిల్లిల్లు తిరిగి చెప్పింది. తన మిత్రులందరికీ మనఃస్ఫూర్తిగా ఆశీస్సు లిచ్చింది.

ఆ రాత్రి తన్ను పిల్చి, "బాబూ, నీవు అదృష్టవంతు డివి. ఏదైనా ఉద్యోగం చూసుకో. ఎన్నడూ బీదవాళ్ళని మర్చిపోబోకు. యిదే నా కడసారి కోరిక" అంది. ఆప్యా యంతో తన తల నిమిరింది.

"అదేమిటమ్మా అవేం మాటలు" తన గొంతు బొంగురుపోయింది, మాట పెగల్లేదు.

"లేదు బాబూ! యిక నేచేయలేను. నీవు ఒక యింటి వాడివైతే నాకంతే చాలు" అమ్మ కళ్ళవెంబడి ఏకంగా కారింది కన్నీరు.

♦ ♦ ♦

కాలం మంచిగా ఆశీర్వదించింది. తనకు రైల్వేలో గుమస్తా ఉద్యోగం దొరికింది. నెలకు 100 రూపాయలిస్తారు. ఇంకేం ఫరవాలేదు. అమ్మా తనూ సుఖంగా బ్రతకొచ్చునని ఎంతో ఆశపడ్డాడు.

తను ఆరోజే అమ్మను దాసీ పని మాన్పించాడు. వచ్చేదాంతో వున్నంతలో సంతృప్తిగా నవజీవనం ప్రారంభించారు అమ్మా తను. కాలం సుఖంగా గడిచింది.

3 సంవత్సరాలు 3 నిముషాలుగా గడిచిపోయినై.

అమ్మకు వృద్ధాప్యం సమీపిస్తోంది. కరాళదంష్ట్రలతో మృత్యుదేవత ప్రతి ఒక్క రోజుని కబళించివేస్తోంది. నిన్న వెళ్ళిపోయింది; రేపు వస్తుంది. కాలం వేగంగా ముందడుగువేస్తోంది. నిశ్చలమైన మనస్సుతో దూరతీరాలకు కాలదేవత పయనం గమ్యం చేరేవరకు సాగిస్తూనే వుంటుంది.

ప్రశాంతమైన వాతావరణాన్ని ఝుడివాన చికాకు చేస్తుంది. ప్రకృతంతా చిందరవందర ఔతుంది.

మానవ జీవితాన్ని అనుకోని సంఘటనలు క్రొత్త పథంలో నడిపిస్తయ్. వాటిలో యీ విచిత్రమైన వివాహ బంధం ఎంత విభిన్న ప్రకృతుల్ని ముడివేస్తుందో; జీవితాన్నెలా మార్చివేస్తుందో తలుచుకుంటే గుండెలు తరుక్కుపోతయ్.

అసలు తనకు అప్పుడే పెళ్ళిచేసుకోవాలనిలేదు. అమ్మ "నే బ్రతికుండగానే నా కోరిక తీర్చమని" పట్టుబట్టింది. కాలం నెట్టుకువచ్చింది. ఏమైతేనేం; వెంకాయమ్మతో వివాహం

వైభవంగా జరిగింది. ఆమెకు తల్లివుంది. ఆ ఊళ్ళోనే ఒక చిన్న యిల్లు వుంది. మరేచుట్టాలులేరు. ఆస్తులులేవు. పెళ్ళి జరగగానే తనూ, అమ్మా వాళ్ళింటికే వెళ్ళారు.

మొదట కొద్దిరోజులు సుఖంగానే గడిచిపోయినై. జీవితం అసలుస్వరూపం తరువాత తరువాత యీ ఆరు మాసాల్లోనే బోధపడింది.

వెంకాయమ్మది విచిత్రమైన మనస్తత్వం. ఆమెకు త్యాగమంటే ఏమిటో తెలియదు. ఇతరుల సుఖం అంత కన్నా తెలియదు. ఎవరైనా తన సుఖంకోసం ఎంత మాట పడితే అంతమాట అనేస్తుంది. వాళ్ళ బాధ లెక్కచేయదు.

ఇక వాళ్ళమ్మ ఆమెకన్నా నాలుగాకులు ఎక్కువ చదివింది. ఇతరులన్నా వాళ్ళ సుఖాలన్నా ఆమెకు లెక్క లేదు. తన సుఖమేమో; తనేమో.

ఆ విషపూరితమైన, యీర్ష్యాసంకులితమైన వాతావరణంలో కాపురంచేయటం తనకే అసంభవ మనిపించింది. కాని గత్యంతరం, శూన్యం!! పెళ్ళి అసలు విలువ "నూరేళ్ల పంట" అనే సూక్తి నిజతత్వం యీనాడు. తనకు అవగత మైంది.

కాలం చిన్నచూపు చూచింది.

ఈ ఆరునెలల్లో అమ్మ సగం కృశించి కృంగిపోయింది. ఆమె తనతో చెప్పకపోయినా, ఆమెలో ఏదో తీరనిబాధ ఆరని ఆవేదన అసంతృప్తి ఆమెను దహించివేస్తున్నాయ్.

కాని ఏనాడూ ఆమె ప్రశాంతమైన వదనంపై తనముందు విషాదచ్ఛాయలు రానియలేదు.

వారం రోజులక్రితం జరిగిన సంఘటన తన్ను దహించి వేస్తోంది. అమ్మేనా లేక అమ్మలోపల దాగివున్న ఏదైనా అంతశ్శక్తి ఆ మాటలు అన్నదా? అని తనకు యిప్పటికీ అనుమానంగా వుంది. ఉదయమే లేచి తను ఆఫీస్‌కి బయలుదేరాడు.

"బాబూ" అమ్మ జీర్ణించినకంఠం విన్పించింది. ఆమె పంచలో పడుకునివుంది. తను వెళ్ళాడు.

"బాబూ, నేను తిరుపతి చూచిరావాలని వుంది; ఏమంటావ్?"

తనకు దుఃఖం పెల్లుబికింది. "అమ్మా, యీ స్థితిలో నీ వొక్కదానివే పోతావా? ఒకవారంలో సెలవుపెట్టి నేనే తీసుకుపోతాను" అని చెప్పి తను పని తొందరలో ఆఫీసు టైమైందని వెళ్ళిపోయాడు.

గోపీ నడుస్తున్నాడు. వీధి మలుపులు తిరుగుతున్నాడు. ఇల్లుదాపుకొస్తూంది. త్వరత్వరగా అంగలు వేస్తున్నాడు.

అమ్మ యిదివరకు బదరీయాత్ర చూసిరమ్మని తను బలవంతపెట్టినప్పుడు "నాయనా నిన్ను కళ్ళార చూడకుండా నే నుండలేను" అని చెప్పి యాత్ర పోనంది ఇవాళ తనకు తానే పోవటానికి సంకల్పించుకుంది. కారణం తనకు ఆరోజున అర్థం కాలేదు.

ఈ ఆరునెల్లనుంచి సంసారగొడవలో తనకు క్షణం తీరికలేదు. ఉద్యోగం; సంసారం! ఈ రెంటితోనే సతమతమౌతున్నాడు. అమ్మను పరామర్శించిన క్షణంలేదు. కనిపెంచిన అమ్మను, మానవరూప దేవతయైన అమ్మను పంచప్రాణాలైన అమ్మను పలకరించటానిక్కూడా వీలుండటము లేదు.

నిన్నరాత్రి తను యింట్లోకి అడుగుపెడ్తూ విన్నాడు. తన భార్య అంటోంది "వెధవముండ, ఎప్పుడు పీడ విరగడౌతుందో? దాసీ పనిచేసినదానికి నీళ్ళుకూడా అందించాల్సొచ్చింది." తను అడుగుపెట్టేలోపలే అత్త అందుకుంది. "వారం నుంచి జ్వరం తగ్గటల్లా. తొందరగా చావదు, మా చావుకొచ్చింది."

తన ఒళ్ళు వుడికిపోయింది. గుండె మండిపోయింది. ఏదో అంతుతెలియని శక్తి తనావేశించింది. భార్యని యిష్టమొచ్చినట్లు కొట్టాడు. ఫలితం శూన్యం! "మా యింటికొచ్చి నన్నేకొడతావా" అంటూ సాధింపు మొదలుపెట్టింది. ఆమె తల్లి జోడించింది. తనకు ఆవేళకూడా సెలవురాలేదు. ఆవేళ ఫస్టు, అసలే పని మెండు. ప్రొద్దున్నే చీకటితో లేచి అమ్మని పలకరించకుండానే వచ్చేశాడు. మళ్ళీ యిదే యింటికి రావటం.

అమ్మ యీ ఆరుమాసాలనుంచి ఎంతబాధ పడ్తుందో ఎంత విషాన్ని తనకు దూరంగా వుంచటానికి ప్రయత్నిస్తుందో లోలోపల ఎంత కుమిలిపోతుందో తనకిప్పుడు అర్థమైంది.

అమ్మకి వారం క్రిందటనుంచి జ్వరం వస్తున్నది, దౌర్భాగ్యుడు తను పలకరించటానికి నోచుకోలేకపోయాడు. ఈ ఆరుమాసాలనుంచీ భార్య, అత్త అమ్మను యింతే సాధిస్తున్నా రనుకున్నప్పుడు గోపీ ఒడలు జలదరించింది.

అమ్మ ఎంత బాధనైనా దిగ మ్రింగుకుంటుంది. అమ్మ మరణానికైనా సిద్ధపడ్తుంది కాని తన భార్యపైన సాక్షీలు చెప్పి తన కాపురం పాడుచేయటం అమ్మకు యిష్టం లేదు. అందుకే నిన్న తను భార్యని కొట్టేటప్పుడు "అది నన్నేమీ అనదని, ఏదో కోపం కొలదీ అప్పుడే అందని" సరిపుచ్చి, కొట్టవద్దని వాదించింది.

అమ్మకు ఆమె ప్రాణంకన్నా ఆమె సుఖంకన్నా తన సుఖం ముఖ్యం.

నవమాసాలు కనిపెంచిన అమ్మ, తనంటే పంచ ప్రాణాలు యిచ్చే అమ్మ సాక్షాత్ దేవి స్వరూపురాలైన అమ్మకి యిదేనా తను యిచ్చే ప్రతిఫలం! యిదేనా తన ధర్మం? న్యాయం? గయ్యాళిగంప భార్యని తృణీకరించి కాపురం వదులుకోవటమా? మాతృశ్రీకి వెయ్యిజన్మ లెత్తినా తీర్చలేని ఋణం, యీ జన్మలో ఆదరించి తీర్చు పట్టుతో గోపీ వేగిపోతున్నాడు.

పెద్ద ఏడ్పువిని తలెత్తిచూచి ఉలిక్కిపడి తన యిల్లేనని యింట్లో కడుగు పెట్టే గోపీ "అత్త ఉరిపెట్టుకుంది" అని కళ్ళ బొళ్ళి ఏడ్పు ఏడుస్తున్న భార్యను చూచి "అమ్మా" అని అంటూ అరిచి "తల్లి" శవంపైన స్పృహతప్పి పడిపోయాడు.

♦ ♦ ♦

# ఆశాసాధం

రైలుబండి పోతోంది. జీవిత కావ్యంలో తెలుపు నలుపు పుటలలో దినాక్షరాల్ని తిరగవేస్తున్నాడు రఘు. ప్రకృతి అంతా ఊగి – తూగి – పోతోంది.

రఘు స్నేహితుడు మధు ఇందాక అడిగిన ప్రశ్న అతని హృదయాన్ని కలతపెట్టింది. తను యివాళకూడా జూవాలజి రికార్డు పట్టుకురావటంలేదు. నిన్న తనకు క్లాసులో జరిగిన సంఘటన మరుద్దామన్నా మరపురావటంలేదు. క్లాసులో అందరి ఎదుట రికార్డులో డయాగ్రమ్స్ వెయ్యలేదని యూబ్‍సెంటువేసి తనను బైటకిపంపాడు లెక్చరర్. అతను ప్రొద్దున లేచీ లేవకముందే మైలున్నరనడిచి రైలుబండిఎక్కి కాలేజీకి రావాలి! ఆ తొందరలో యివాళకూడా పుస్తకం మర్చి పోయాడు.

అతని మనస్సు ఊహాతరంగాల్లో తేలిపోతోంది! అసలు నాకు చదువెందుకు? ఏదో కొంత విజ్ఞానంవచ్చింది గదా? అందరు చదివితే ఉద్యోగాలుకూడా లేవనీ, నిరుద్యోగ సమస్య ఎక్కువవుతుందనికదా గవర్నమెంటువారు చెప్పారు! అయినా తను నిక్షేపంలాంటి 25 ఎకరాల భూమిని పండించు కొని ఎందుకు బాగుపడకూడదు?

ఇన్ని ఆలోచనలు ఒకదానికొకటి అతని మనసులో పోట్లాడుకొంటున్నాయ్. హఠాత్తుగా రఘుకు ఒక ఆలోచన వచ్చింది. మాట్లాడితే 'కట్నంకోసమేరా పట్నానికిపంపి

చదివిస్తున్నా' అనే తన తండ్రికెలా ఎదురుచెప్పటం? రఘు గుండెల్లో పిడుగు పడ్డట్టయింది! అతను తన 22 ఏండ్ల జీవితంలో తనతండ్రికెపుడూ ఎదురుచెప్పి ఎరుగడు? మరియుపుడు చదువుకోనని చెప్పటంఎలా అనే ప్రశ్న అతన్ని ఊపివేస్తోంది. రఘు చాలాఅమాయకుడు. బి. యస్. సి. చదువుతున్నా యింట్లో ఎదురుమాట్లాడలేడు. యీకాలపువాడుకాడు.

మళ్ళీ రైలు గమ్యస్థానంచేరేవరకు అతనీ బాహ్యప్రపంచంలో లేనట్టుంది. తన ప్రక్కనకూర్చున్న మధు వీపుమీద చరిచేవరకు నిద్రలోనుంచి మేల్కొన్నట్లు త్రుళ్ళిపడి లేచాడు. కాలేజీవైపు నడిచాడు!

## 2

"బాగా ఆలోచించే చెప్తున్నారా? యింకా బాగా ఆలోచించండి. ఇది ఒకనాటితో తెగిపోయేదికాదు; తేల్చి చెప్పేదికాదు. నూరేండ్లపంట, జీవితాంతంవరకు విడవీడని జంట" అని అడుగుతున్న పెండ్లిసంబంధపు పెద్దమనిషి గోవిందయ్యగారితో రఘుతండ్రి పరంధామయ్య గారిలా అన్నాడు!

"నేను బాగానే ఆలోచించాను. మీరేమైనా ఆలోచించాలనుంటే ఆలోచించుకోండి. మా అబ్బాయి తాళి వేలు కట్టమంటే తప్పకుండా ఒప్పుకుంటాడు. ఇంకా పైన

ఐదువేల రూపాయలు, రిష్టువాచి, సైకిలు మొదలైనవి పెడ్తారాయె! ఇంకేం! వాడు వాణ్ణి తప్పక ఒప్పిస్తాడు"

సరేనని గోవిందయ్యగారూ పరంధామయ్యగారూ తాంబూలాలు పుచ్చుకొన్నారు. వివాహం గడువు యింకా రెండు నెలలు మాత్రమేవుంది. రోజులు గడచిపోతున్నాయ్.

# 3

రఘు పరీక్షలు దగ్గరికొచ్చాయని రూము తీసుకొని పట్నంలో వుంటున్నాడు. అతను సెపరేటుగా ఒకడే రూం తీసుకున్నాడు. ఇప్పుడు ఆ రూమ్‌లో ఒక్కడే అనటంచేత అతని కేమీ తోచటంలేదు. ఎవరితోనైనా కలసి తిరుగుదామన్నా అతనికి తెలిసినవాళ్ళు వీధిలో ఎవరూ లేరు. ఫ్రెండ్స్‌రూమ్స్‌కి యీ రూము చాలదూరం. అతనికి ఎన్నాళ్ళో చలనంలేని జీవితమనిపించింది! ఆ మేడపై ఒక్కటే రూము. ఎవరూ కనిపించరు. ఆ మేడ ప్లీడరు నరసింహమూర్తిగారిది. వారింట్లో కూడా రఘుకు తెలిసినవారెవరూ లేరు. ఒకనాడు రఘు మేడ మీాద పడుకొని చదువుకుంటున్నాడు. అతని కండ్లను అతనే నమ్మలేకపోయాడు. ఒక పదునారేండ్ల యువతి అప్సరసలాగా ఆ మేడమీాదకువచ్చి రేడియో వైరు నొకసుచేత సరిచేసుకుంటోంది. రఘుకు ఆశ్చర్యమేసింది. ఎవరీమె? ఈ నెలరోజులలో తనకు ఒకరోజైనా కనపడలేదు. ఆవిశాలమైన ఫాలం, నల్లటి శిరోజములు, వెడల్పయిన ఆ నేత్రములు పిస్తానుచీరె, క్రొత్తరకపు

జాకెట్టు, కాళ్ళకు ఎర్రస్లిప్పర్సు చూచే ఎవరినైనా వశపరచు కోగలవు. రఘు ఆస్వరూపాన్ని చూస్తుంటే ఏమిటో తెలియని భయసంభ్రమాలు అతనిలో ప్రవేశించాయి. 'కనెక్షన్ సరిగావుందా సరళాదేవిగారు' అన్నాడు నౌకరు. 'ఆ సరిగానే వుంది వెళ్లారా' అంటూ ఆమె మేడదిగిపోయింది.

ఆహా ఏమి ఆకర్షణ ఆ స్వరూపం! ఆ చిరునవ్వు ప్రకృతి అంతా ఆమెలోనే మూర్తీభవించనట్లున్నది_ అనుకొంటూ గుటకలు మింగాడు రఘు.

ఎంత అమాయకుడైనా ఎంతటి అస్ఖలిత బ్రహ్మచారికైనా సుందరిని చూసేటప్పటికి ఏకో ఒకక్రొత్త అనుభూతి కలుగక తప్పదు. స్త్రీని చూడగానే ఎట్టివారు ఇంద్రియ దౌర్బల్యులగుట అతిశయోక్తికాదు.

అతడు సరళను చూడగానే ఏదో మధురానుభూతి పొందినట్లు భావించాడు. అతని హృదయం సరళలాటి అబలా శిరోమణులను అన్వేషిస్తుంది. ఏది తలచినా ఏది చేసినా సరళ అతని హృదయంలో తాండవిస్తోంది. పరీక్షలనెడి భయముతో చదివేవాడుకూడ, అబలాన్వేషణార్థమై చదువుట మానివేశాడు.

మరొకనాడు ఏమీతోచక బజారు వెళ్ళటానికి టాయిలెట్ అవుతున్నాడు రఘు. అపుడు నౌకరు సహాయము లేకుండానే వచ్చి రేడియోవైరు కనెక్షను చేయటానికి ప్రయ

త్నించి అందక బాధపడుతున్న సరళను చూచాడు రఘు. అతని నోటివెంట అప్రయత్నముగా మాటలువచ్చాయి.

"నేను కనెక్టు చేస్తాను సరళాదేవిగారు. మీరుబాధ పడనక్కర్లేదు." అంటూ ముందుకువచ్చాడు రఘు.

"ఆ......మీకెందుకులే శ్రమ" అన్నది. "సరళ పరవాలేదులెండి ఇందులో శ్రమయేముంది" అంటూ సరళ చేతిలో వైరుతీసుకున్నాడు రఘు వైరుకనెక్షన్ పూర్తికాగానే థాంక్స్ చెప్పింది సరళ.

ఆ ఫరవాలేదులెండి అన్నాడు రఘు.

సరళ మేడదిగిపోయింది. అప్పుడే రఘు సరళ హృదయంలో హత్తుకుపోయాడు. పసిమి పచ్చరంగు, ఘుమార్హైన పొడవు. పక్కపాపిటి, విశాలమైన ఛాతీ, మెలికలు తిరిగిన జుత్తు, గళ్ళపైజనూ, సింఫల్ శ్లాక్సాతో చూసే ఎవరినైనా ముగ్దులునిచేసే రఘుఆకారం సరళలాంటి అబలహృదయంలో హత్తుకుపోయిందంటే ఆశ్చర్యమేముంటుంది!

క్రమక్రమేణ రఘుకు అక్కడ చుట్టుపట్లవారితో పరిచయమయింది. అతని స్నేహితుల్లో సరళ తమ్ముడు హరి ముఖ్యుడు. ఏవిషయానికైనా హరి, రఘు, సంప్రదించుకుంటారు. ఒకరిష్టములేకుండ మరొకరు ఏపనిచేయరు. ఒక కంచంలో తిని ఒక మంచంలో పండుకొంటునట్లుంటున్నారు. క్రమక్రమేణ వారి స్నేహం వృద్ధిపొందుతూంది. రఘు అప్పు

డప్పుడు వాళ్ళ యింటికికూడా వెళ్తున్నాడు. హరి ఎప్పుడు రఘు రూములోనే వుంటాడు. ఇద్దరుకలసి పార్కుకు వెళ్ళటం అలవాటు.

ఒకనాటి సాయంత్రం హరి రాలేదు రఘు వాళ్ళింటి కెళ్ళాడు. వాళ్ళమ్మ వెనుకగదిలో వంటచేస్తోంది కాబోలు. నరసింహమూర్తిచౌదరిగారు కోర్టుకు వెళ్ళారు. ముందుగదిలో సరళ సోఫాలో పడుకొని చదువుకుంటున్నది.

"హరి ఎక్కడకు వెళ్ళాడండి" అన్నాడు రఘు. "హరి టెన్నిసుకెళ్ళాడండి" అంది సరళ మధుర స్వరంతో. వెంటనే వెనక్కుతిరిగాడు. ఏదో జ్ఞాపకంవచ్చినట్లుండి "ఎప్పుడు వస్తాడండి" అన్నాడు మరల.

"ఏమోనండి తెలియదు, బహుశా ఏడింటికిరావచ్చు. కూర్చోండి నుంచున్నారేం" అంటూ సోఫాచూపించింది సరళ.

ఇషము లేకపోయినప్పటికి కూర్చున్నాడు రఘు. ఏమీ తోచక "ఏమిటి చదువుతున్నారు" అన్నాడు మెల్లగా.

"ఆ......ఏమిలేదు ఏదో వీక్లి" అంటూ బల్లపై పెట్టింది సరళ.

"రోజు సరదాగా పార్కుకువెళ్ళేవాళ్ళం హరి నేను. ఇవ్వాళ హరి లేకపోతే అదోలావుంది" అన్నాడు.

"మేముకూడా వెళ్ళేవాళ్ళం కాని, ఇవాళ ఏమీ బాగుండలేదు. అందువల్ల ఇంట్లోనేకూర్చున్నాను" అంది చిరునవ్వుతో సరళ.

"ఇంట్లో కూర్చుంటే ఏమితోచదు. అటు వెళ్దాం రండి" అన్నాడు రఘు కొంచెం భయంగా.

"బాగాలేకపోయినప్పటికి ఏదో మీరు రమ్మంటున్నారు కాబట్టి వెళ్దాం పదండి" అంటూ సరళ టాయిలెట్ అయి వచ్చింది.

ఇద్దరూ కలసి దూరాన వున్న పార్కుకు వెళ్ళారు. అది సాయంత్రం. అప్పుడే సూర్యుడస్తమించబోతున్నాడు. పడమటి కొండలు సూర్యునికి తమ పూర్తి ఆహ్వానాన్ని తెలుపుతూ ఎరుపురంగుచేత అలంకరించుకొన్నాయి. చల్లటిగాలికి పార్కు లోని చెట్లన్నీ నాట్యం చేస్తున్నాయి. పక్షిజాలములు తమ బిడ్డలతోసహా గూళ్ళుచేరుకుంటున్నాయి. దూరాన బీచినుంచి వచ్చే చల్లని గాలిదేవుడు, ప్రేయసీ ప్రేమికులను గాఢంగా కౌగలిస్తున్నాడు. ఆఫీసుల్లో పనిచేసి ఉక్కిరిబిక్కిరైన ప్రజ లంతా చల్లటిగాలిని తనివితీరా గ్రోలుచు పార్కులో కూర్చొని వున్నారు. ఆకాశవాణి ఎడతెగకుండా అందరికీ కబుర్లు చెప్తోంది. ఒకప్రక్క, పిల్లలందరుగూడి జారుడుబల్లపైన జారుతున్నారు. ఎట్టివారినైనా ముగ్ధులుచేసే వాతావరణమది.

రఘు సరళలు పార్కులో మారుమూలవున్న ఒక బల్లపై కూర్చున్నారు.

"స్టడీస్ బాగా సాగుతున్నవా" అని ప్రశ్నించింది సరళ. "ఏదో పరవాలేదులెండి ఒకమాదిరిగా చదువుతున్నాం. ఫస్టుక్లాసుకు ప్రయత్నం చేస్తున్నాం" అన్నాడు రఘు.

"మాకు విశ్రాంతే వుండదు. ఇవ్వాళే కొంచెం తీరిక. క్రొత్త పిక్చర్సు ఏమన్నా వున్నాయా?" అంది సరళ.

"ఓ వున్నాయి. సీట్లు రిజర్వు చేయించనా" అన్నాడు రఘు. "ఓ మరీని" అంది సరళ.

ఆ ఇద్దరినీ వదలలేక వదులుతున్నట్లు సూర్యుడస్తమించాడు. కొంచెం కొంచెం అధకారం ఆవరించుతోంది.

రఘు సరళలిద్దరు రిక్షా ఎక్కారు. రిక్షాలో ఇద్దరు ఒకరి ప్రక్క ఒకరు కూర్చున్నారు. సరళ ప్రక్కకు జరుగుతోంది. రఘు ఇంకా ఆనుకుంటున్నాడు. ఇద్దరు రిక్షాదిగి రూమ్సుకి చకచకా నడచిపోయారు.

♦ ♦ ♦

అది రాత్రి ఎనిమిదిగంటల సమయం. అమావాస్యదినము. చీకటి లోకాన్ని ఆవరించింది. మనిషికి మనిషి కనిపించటం లేదు అప్పుడు రఘు, సరళలు రిక్షా ఎక్కారు. సరిక్రొత్త సినిమా ఆడే హాలుకు చేరుకున్నారు. హాలులో ఇద్దరూ సోఫాల్లో కూర్చున్నారు రఘు ముందుగా కథ అంతా చెప్పాడు. డ్రాక్షు తెప్పించాడు; ఇద్దరు త్రాగారు. ఆట ప్రారంభమైంది. కథరసవత్తర మగుతుంది. రఘు సరళ ప్రక్కకు జరిగాడు. ఆమె కాస్త సంకోచంగా అవతలకి జరిగింది. కొద్దిసేపటిలో అతని చెయ్యి ఆమె భుజాలపై నాట్యం చేస్తుంది సరళకు ఏమీ తెలియనట్లు తెరవైపు అమాయకంగా చూస్తుంది. మరి కొద్దిసేపటిలో అతనిచేతులు ఆమెను కౌగి

లించాయి. ప్రేయసీప్రేమికులు ఒకరినొకరు అకల్మషంగా హత్తుకుపోయారు. అలా ఎన్నిగంటలు గడిచాయో వారికే తెలియదు. నిద్రితులను కోలికోడి లేపినట్లు యింటర్ వెల్ గణగణమంటూ వారిని బాహ్యప్రపంచంలోకి మేల్కొలిపింది.

తరువాతఆట మళ్ళా ప్రారంభమైంది. ఆ అమాయిక లేతహృదయాలు ఎందుకో కలవరపడుతున్నాయ్. సరళ తత్తరపడుతూ అటు ఇటు చూస్తోంది. "అలా కంగారుపడతావు దేనికి సరళా" ప్రశ్నించాడు రఘు.

"ఆ, ఏమిలేదు నేనొకటి అడుగుతాను కోప్పడరుకదా" తత్తరపడుతూ అంది సరళ.

"కోపమెందుకు? ఇంకమనలో కోపతాపాలుఅక్కర్లేదు. ఏమిటో తక్షణం కోరుకోవచ్చు."

"ఆ...ఏమిలేదు మీరు నన్ను వివాహం చేసుకుంటారా?" అమాయకంగా ప్రశ్నించింది సరళ.

"ఓ! తప్పక. సరళా నీవడగనక్కరలేదు. మనిద్దరం క్రొత్త జీవితం ప్రారంభించుకొందాం."

ఆ ప్రేయసీ ప్రేమికులు ఏదోదీర్ఘాలోచనలో పడ్డారు. అంతే...మళ్ళా సినిమా చివరిగంట మ్రోగేవరకు బాహ్య ప్రపంచంలోలేరు. తదనంతరం రిక్షాఎక్కి ఇల్లుచేరారు.

సరళకు మనస్సు మనస్సులోలేదు. నిద్రపట్టలేదు. ఆమె మనసుఎందుకో కలవరపడుతోంది. తను అవివాహిత.రఘుతో తన సంబంధం తెలిస్తే లోకం ఏమనుకుంటుంది? తరతరాల నుంచి వస్తున్న పరువుమర్యాదలు ఏమవుతాయి? రఘు తన

కేమైనా మత్తుమందుచల్లాడా ఏమిటి? తనఈ అంతు తెలియని ప్రేమ ఈ కామవాంఛ అధఃపతనముచేయదుగదా. తను యీలోకములో పతితగా వ్యవహరింపబడదు గదా? ఇవే ఆలోచనలు సరళ మనస్సులో పరిగెత్తుతున్నాయి. మరొకప్రక్క మానవజన్మ ఎత్తిన ప్రతిప్రాణి ఇంతకంటె కోరుకునే దేముంది. సౌభాగ్యంకంటె ఇంక సుఖమెయ్యది. మానవుడు కళకొరకే సృష్టింపబడ్డాడు. కళననుభవించడమే అతని విధి. లోకమునకు తనకు సంబంధం ఏమిటి? తనకు తగిన వరుడుదొరికాడు, అంతే తనుకోరేది. ఏమో, మగవారి మాటలు నమ్మకూడదు. ఎలా రఘుని నమ్మటం? ఈ ప్రవాహాలతో ఆమె ఎప్పుడు తెల్లవారుతుందా అని వేక్షిస్తోంది.

రూములో బెడ్‌పై పరుండిన రఘుకు నిద్రపట్టలేదు. ఏమిటి తనుచేసింది. తన్ను సరళ నిజంగా పెండ్లాడుతుందా! ఏమో, ఆడవారిమాటలు అపనమ్మకాలు. ఒకవేళ పెండ్లాడితే 'కట్నం కోసమేరా నీ పట్నంచదువనే' నాన్న ఒప్పుకుంటాడా? పుట్టిన తరువాత తను నాన్నకు ఎదురాడి ఎరుగడు. యిప్పుడు పులిలాటి నాన్నకు ఎదురుచెప్పటం ఎలా? అని పరిపరివిధాల ఆ చిస్తూ నిద్రాదేవతకు వశుడయ్యాడు రఘు.

# 4

క్రమక్రమేణ రఘుపేరు నరసింహమూర్తిగారికికూడా తెలిసింది. ఇల్లందరిచేత మెప్పొందాడు రఘు. అతను బుద్ధిమంతుడని తెలుసుకున్నాక, హరి స్నేహితుడవటంవలన

నరసింహమూర్తిగారు ఇంటిఅద్దె తీసుకోవడంలేదు. హరి పట్టుదల వలన రఘు హోటలు భోజనము వదలి నరసింహమూర్తిగారింట్లోనే తింటున్నాడు. మొదట స్నేహంగా వున్న వారి సంబంధం చాలా దగ్గరగా పరిణమించింది. రఘు అన్నం తినందే హరి తినడు. అతనికి కష్టమొస్తే యితనికి వచ్చినట్లు భావిస్తాడు.

రోజులు దొర్లుతున్నాయి. పరీక్షలు సమీపిస్తున్నాయ్. సరళ తన భావిజీవితాన్ని గూర్చి, తీయని కలలుకంటోంది. "ఏమమ్మా మాట్లాడవేం. ఈడొచ్చిన పిల్లవు. ఇంట్లోవుంటే లోకం ఏమనుకొంటుంది, అపోహలతో ఆడిపోసుకోదూ. చెప్పు తల్లీ నీ ఇష్టంవచ్చినవాళ్ళకిచేస్తాను. నీవేమీ భయపడనద్దు." అంటూ బ్రతిమాలుతున్న తన తండ్రి నరసింహమూర్తిని చూసి సరళ ఇలా అంది. "అప్పుడే ఏం తొందర. నాన్నగారూ! నా పరీక్షలైనా కాలేదాయె! పరీక్షలైన తరువాత చెప్తాను"

"అది కాదమ్మా, యిప్పుడేచెప్తే నేను ప్రయత్నాలు చేసుకుంటాను" "నేనింకా ఎవర్నీ నిర్ణయించుకోలేదు. తరువాత చెప్తాను" అంటూ తప్పుకుంది సరళ.

నరసింహమూర్తిగారు పదిమందిలో తిరగనేర్చిన పెద్ద మనిషి. కూతురు ఎదుగుతున్నకొలదీ ఆయనకు భారమెక్కువవుతుందని తలచాడు. వెంటనే పెళ్ళిచేయాలనే కోరిక ఆయన బాగా నిర్ణయం చేసుకున్నాడు. అట్లయితేకాని బరువు తగ్గదనుకున్నాడు.

# 5

ఉదయం 9 గంటలు కావస్తోంది. చలిగాలిలో పనికి పోతున్న మనుష్యులకు సూర్యభగవానుడు తన వెచ్చటి కిరణాల్ని ఇచ్చి కొంత సంతోషాన్ని చేకూర్చాడు. ఎవరిపనులకు వారు తహతహలాడుతున్నారు ప్రజలు.

"రఘూ! రఘూ! 9 గంటలు కావస్తోందిలే" అంటూ రూముకి వచ్చాడు హరి. రఘు బాగా ప్రొద్దుపోయి పడుకోవటంవలన మెలకువరాక అవస్థపడుకొన్నాడు. హరి వీపుమీద చరిచేంతవరకు రఘుకు మెలకువరాలేదు. విశ్వప్రయత్నంమీద రఘును నిద్రనుండి లేపగలిగాడు హరి.

లేచి వెంటనే ముఖం కడుక్కొనివచ్చాడు రఘు. సరళ కాఫీ తెచ్చింది. ఇద్దరూ కాఫీ త్రాగుతున్నారు.

"మీకు కవరు వచ్చిందండీ" బయటనుంచి పోష్టుమాన్ గొంతు వినిపించింది. హరి లేచిపోయి ముందుగా కవరందుకొన్నాడు.

లోపలకు రాగానే తమ్ముడు చేతిలోంచి కవరు లాక్కుంది సరళ. కవరుచించి చదువుట ప్రారంభించింది.

సాలూరు,

15_i_56.

ప్రియమైన రఘుని దీవించి నాన్న వ్రాయు విషయము. నీవు క్షేమమని తలుస్తాను. నేనిచట క్షేమముగానే యున్నాను. నీకు పెండ్లిసంబంధంవచ్చింది. ఇరవైఐదు వేలు

కట్నం. పైన అయిదువేలు, సైకిలు మొదలగునవి పెడ్తారట. కట్నం విషయం భయపడనద్దు. పిల్ల గోవిందయ్యగారమ్మాయి. కాబట్టి నీవు అర్జంటుగా తిరిగిరావలెను.

ఇట్లు మీ తండ్రి,
పరంధామయ్య.

ఉత్తరం చదవటం ముగించకమునుపే సరళ గొంతు భయ కంపితమైంది. ముత్యాలవలె కళ్ళనుండి దుఃఖబాష్పాలు రాల్తున్నాయ్. తమ్ముడు హరి చూస్తాడేమోనని పైట కొంగుతో కళ్ళను ఒత్తుకుంది.

రఘు మనస్సు యిక్కడ లేదు. కాఫీ త్రాగుతున్నాడే గానీ ఎక్కడో ఏదో ఆలోచిస్తున్నాడు.

"ఓహో పెళ్ళికాబోలు. నే కూడా రావచ్చా రఘూ" అంటూ అమాయకంగా నవ్వుతున్నాడు హరి.

కొద్దిసేపటికి రఘు, హరి కాఫీముగించారు. హరి ఏదో పనుందని క్రిందకు వెళ్ళాడు.

సరళ దిక్కులుచూస్తూ అంది బెరుకుగా అమాయకంగా "నాతో అన్నమాట జ్ఞాపకముందా?"

"మనిషికి రెండు మాటలుండవు సరళా" నిశ్చలంగా సమాధాన మిచ్చాడు రఘు.

* * *

## ఉ ప సం హా రం

జటిల సమస్యలను సులభంగా విడదీయగల్గిన వివేకం గల రఘూ తండ్రిని ఎదిర్చి మాటకోసం, అనురాగ అనుకూల, దాంపత్యంకోసం సరళను వివాహమాడాడు— ఏకైక పుత్రుడు, గారాబుపట్టి కన్పించకుండా పోయేటప్పటికి రఘు తల్లి పస్తులతో మంచమెక్కింది. కొడుక్కి లక్షల కట్నం తెద్దామనుకున్న పరంధామయ్య 'ఆశాసౌధం' కూలిపోయింది.

పరంధామయ్యను అందరూ తలాఒకమాట అనటం మొదలుపెట్టారు అసలు నీ అత్యాశే యింత తెచ్చిందని, అసలు నీవే రఘుని పాడుచేశావనీ మెత్త మెత్తగా చివాట్లు పెట్టారు.

మొదట ఒప్పుకోకపోయినా, భార్య ఒత్తిడిచేత పరంధామయ్య రఘుని వెదకాటానికి పట్నం బయలుదేరాడు.

తిరిగితిరిగి అప్సరస్సలాంటి కోడలు సరళనుచూచి, కొడుకు చేసిన మంచిపనికి మురిసిపోయాడు. తనకోడలే లక్షల కట్నమని సంతృప్తిపడ్డాడు. తన ధనలోభానికి తనే నొచ్చుకున్నాడు.

రఘు, హరి, సరళలు బాగాచదివి పరీక్షకెళ్ళారు. ఫస్టుక్లాసులో పేసైయ్యారు.

—o—

# వాడిన పువ్వు

[గుంటూరు హిందూ కళాశాల విద్యార్థి రచయితల సంఘంవారు నిర్వహించిన పోటీలలో ప్రథమ బహుమతి పొందిన కథానిక.]

రోహిణి ఎండలు—మధ్యాహ్నం 12—దూరాన ఎండమావులు పగటికలలుగా కన్పిస్తున్నాయ్.

ఆకాలమైన సమయంలో, అంతుతెలియని బాటలో గమ్యస్థానం దొరకని బాటసారిలా, అంతంలేని బాటలో అనంత యాత్ర చేస్తోంది సుధాదేవి.

ఏమేమో, తలపుల వలపులతో ఇంతవరకు భారమైన జీవితాన్ని 'గతుకుల బాటలో అతుకుల బండిలా' యీడ్చింది తను. తన జీవితమొక మహాసాగరమని - అందులో తను చుక్కానిలేని నావనని ఇపుడే గుర్తించగల్గింది. జీవితమంటే విరక్తిగల్గింది తనకు. అవును ఎందుకు కలుగదు. తన 'ఆశా సౌధం' ఒక్కమారు కూలిపోయింది. తను కన్న కలలన్నీ గాలి అలలైనై. తన మనస్సులో కట్టిన పిచ్చికగూళ్ళు చెల్లా చెదరైనై. ఇంతవరకు తన మనస్సులో ముందుకువస్తుందనే ఒక్క - ఆశాకిరణం దాగుడుమూతలాడుతూ తనని బలవంతంగా జీవింపజేసింది. తను వచ్చినపని అయిపోయింది. ఇక ఎవరికోరకు, ఎందుకు, ఏ ఆశయానికి తను జీవించాలి? తనలా అందరు ప్రపంచంలో, ప్రతి ప్రాణి ఏదో ఒక ఆశయానికి ప్రాకులాడి, విఫలులై, కుమిలి, కుమిలి, కృశించి కృంగి పోవటారనేముంది?

తన జీవితకావ్యంలో, తెలుపు నలుపు పుటలలో దీనా క్షరాలని తిరగవేస్తూ, చూచినపుటనే మళ్ళీ చూస్తూ, ఏవేవో వూహాలతో మనోసముద్రాన్ని మధిస్తూ నడవలేక నడవలేక భారంగా, బడలికగా, ముందుకు నడుస్తోంది సుధా దేవి తన బాటలో.

అందరిలా, ఆమెకి కాళ్ళు మాడటంలేదు. కళ్ళు చెదరటంలేదు. ధూళి పడుతుందనే వూహాలేదు. జ్వర మొస్తుందనే భయమేలేదు. ఆమెలా జీవితంలో కష్టనష్టా లను, కాచి వడపోసిన అనుభవశాలులు ప్రపంచంలో చాలా కొద్దిసుంది. కష్టాల అలలను ఢీకొంటూ, సుదీర్ఘమైన, సువి శాలమైన జీవితసముద్రాన్ని తరచి, ఒడ్డు చేరాలనే ఆశయం, ఆకాంక్ష, అభిప్రాయం, ఆమెకు పుట్టుకతో భగవంతుడిచ్చిన వరం. అందుకనే ఆమె ఇన్నాళ్ళు జీవచ్ఛవంలా కాల చక్రపు టిరుసులలో పడి నలిగిపోయింది. ఇకముందు యీ ప్రపంచంలో తను వుండవలసరంలేదు – తను వచ్చినపని అయి పోయింది. ఒక ఆలోచనా మేఘం, మరొక ఆలోచనా మేఘంతో, ఢీకొంటూ, బద్దలైపోతూ, హృదయాంబరపు, నిర్మల సరోవరాన్ని కల్లోలపరుస్తుంటే, చికాకు చేస్తుంటే, నుదురును చేత్తో ఒత్తుకుంటూ, హత్తుకుంటూ తన యాత్రా ప్రయాణంలో లీనమైంది సుధాదేవి.

రోడ్డుమీద ఎవరూ లేరు! ఎటుపోవాలో తెలియక, పట్టణానికి వెలుపలకుపోయే బాట తనదిగా ఎన్నుకుంది సుధా దేవి. నడుస్తోంది! నడుస్తోంది! నడుస్తోంది! ఎంత నడచినా

బాట అంతంకావటంలేదు. బ్రతుకు అంతమైతేగదా బ్రతుకు బాట అంతం కావటానికి!

ఉన్నట్లుండి సుధాదేవి కళ్ళు అప్రయత్నంగా, విశాలంగా తెరుచుకొని, ఏదో కనులపండువైన దృశ్యాన్ని అవలోకించ ప్రయత్నించినై. ఇపుడు సుధాదేవి ముఖం – ప్రభాకరుని కరంసోకి విప్పారిన పద్మిని. మళ్ళీ ఒక్కసారి కళ్ళువిప్పి చూసింది. ఆ ఎవరో...ఏదో...ఇదివరకు చూసినట్లుంది. దినాల, పోకచే, కాలచక్రం, ముందడుగుచే, సుధాదేవి హృదయపు మడతలలో మరుగుసపడిన గత జీవిత స్మృతి పైకివచ్చింది. తన గడచిన జీవితంలో, ఆ మొఖం, ఆ పాత్ర...ఏదో కొంత పాత్ర నిర్వహించినట్లుంది. తన జీవితనాటకంలో ప్రధాన పాత్రలావుంది. తనకు ముందు సందు మలుపులోకి పోతున్నట్లుంది ఆ...ఆకారం...

సుధ క్షణంసేపు తటపటాయించింది. మరొక్క క్షణంలో భారమైన పాదాలతో పరుగుతీసింది ఆ ఆకారం వైపు. ఏమిటి లాభం! తను సందుమలుపు తిరిగేలోపల ఆ...నరాకారం పురుషాకారం...ఇంటిలోకి అడుగుపెట్టింది సుధ ఆత్రంతో ఆవేశంలో అనుసరించబోయింది. విచిత్రం! క్షణంలో, ఆ ఆకారం సుధవైపు హేయంగా, కఠోరంగా చూపు సారించి, పిచ్చిది...అని నవ్వుకొంటూ, విచిత్రంగా చూస్తూ, ఫెడీమని తలుపు మూసివేసి, గడివేసింది.

సుధ హృదయం మరిగిపోయింది. అంత ఎండలో తిరిగినా లేని వేడి శరీరాన్ని ఆవరించింది! జ్వరమొచ్చింది!!

అభాగిని పాపం! సందు తప్పించి మళ్ళీ రాచబాటలో పడింది. జీవితంలో ఏదో అడ్డడోవలు సమయానుకూలంగా వచ్చినంత మాత్రాన అవి జీవితయాత్రని అంతంచేయలేవు! నరరూప నక్తంచరుడు ఇందాకటి తలుపుకు మాత్రమే గడి వేయగలడు గాని, గుండెకు గడివేయలేడు. రాచబాటే ఏనాటికైనా, మానవు డనుసరించదగింది. ఇది సుధ అనుభవంలో తెలుసుకున్న – మరధర్మం! నగ్నసత్యం!

సుధ నడుస్తూనే వుంది. ఆమె హృదయం ఏమేమో అన్వేషిస్తోంది. ఆమె జరిగిన తన జీవితప్రయాణం జ్ఞప్తికి తెచ్చుకోటానికి ప్రయత్నిస్తోంది. ఆమె హృదయరంగంలో, గత జీవిత స్మృతులు ఆలోచనల రూపంలోగాక, చిత్రాల రూపంలో ప్రదర్శించబడుతున్నయ్. ఆ చలనచిత్రం ఓఅగాధమైన, సువిశాలమైన, అంతులేని, అంతంతేలని జీవితయాత్రకి సంబంధించింది. అది యిప్పటికి సంతోషాంతంకాదు. తన గడచిన జీవితయాత్రలో, ఒడుదుడుకులు, రే...పనలులు, తెల్పునల్పులు, సంఘటనలు, సన్నివేశములు, పవిత్రమైన, విలువైన, ముహూర్తాలు అన్నీ యీనాడు అంతుతెలియని బాటలో అగమ్యమైన యాత్ర చేస్తున్న సుధాదేవి కళ్ళ ముందు గిరాగిరా తిరిగిపోతున్నయ్.

సుధాదేవి నడుస్తున్న దారి తరగటంలేదు. గొప్పవారి జీవితంలో లా తన జీవితంలో డైరీ వ్రాయవలసిన అవసరం రాలేదు. తనకు అసలు ఏమైనా పదిమంది వినదగిన సంఘటనలుంటేగా ఆపని చేయటానికి? ఆమె, దేశనాయకులు

లాన్నూ, సంఘసంస్కర్తల్లాగా, శిల్పిగా దేశానికి సేవ చేయ లేకపోయినా తన జీవితఅనుభవం మాత్రం చెప్పగలదు. అదే 100కి 10 మంది జీవితపు అసలు నిర్వచనం బోధించి వారిని చక్కదిద్దగలదు. అయితే తను అందరిలా తన జీవిత అనుభవాన్ని కూర్చి ఉపన్యాసం ఇవ్వటంలేదు. బలవంతంగా తన మనోరంగంలో ప్రదర్శింపబడుతున్న జీవితచిత్రాన్ని చూచి సంతోష సంతాపాల్లో మునిగి తేల్తోంది.

తనను అధఃపాతాళానికి తోసి ఆ చీకటికూపంలో అణచి పెట్టి. జీవితాన్ని సర్వనాశనం చేసిందొక సన్నివేశం... ఆ ఒక్క సన్నివేశం ఆమె మగుద్దామన్నా మరుపు రావటం లేదు. తన మనోరంగంలో చలనచిత్ర ప్రదర్శనజరుగుతోంది. అది ఇపుడు కన్నులకు కట్టినట్లుంది.

* * *

తను భిక్షాధికారి కుమార్తె. అందాల అప్సరస అని అందరూ అనేవారు. ఆ...ఎందుకు కొరగాని రూపనే తన్నిలా చేసివేసింది; తన సర్వనాశనానికి కారణమైంది. తను తన మూర్తిలోని సౌందర్య స్ఫూర్తిని ఇపుడు తిట్టు కుంటుంది. ఏమిటి లాభం!

తను కాలేజీలో చదివే రోజుల్లో, సీతాకోక చిలుకలా, తన అందానికి, అనల్పమైన శృంగారు వలువలా ధరించి అందరిలో ఓచేయి పైగా, సరదాగా వుండేది. తన ఫస్టు మార్కులికి గవర్నమెంటువారు ఫుల్‌స్కాలరుషిప్ ఇచ్చే

వారు. లేకపోతే దస్తావేజులు అమ్ముకు బ్రతికే తనతండ్రి, రోగిష్టి తల్లీ, పూట గడవటం కష్టంగావున్న ఇంట్లో తను బి. ఎ. ఎలా అనడం.

కాలేజీలో ప్రతి క్లబ్బులోను, ప్రతి పోటీలోను తను పాత్ర తీసికొనేది. విద్యార్థి రచయితల సంఘం ప్రెసిడెంట్ తనే, డ్రామా అసోసియేషన్‌లో తనే ప్రథమ బహుమతి పొందింది రచన చేయటంలో నీకు నీవే సాటి అనేవారు తన ప్రొఫెసర్లంతా.

మకరంద మాధుర్యంకోసం ఆశపడి పుష్పం చుట్టూ తిరిగే తుమ్మెదలులా కాలేజీలో ప్రతి యువకుడు తనచుట్టూ తిరిగేవారు...తనతో ఒసారి మాట్లాడితే చాలనుకునేవారు. తను వ్రా, అంటే ఓ చిన్న పనినైనా వందలాది చేయటానికి ప్రయత్నించేవారు. తన ఇష్టంలో మనస్సులో తగిన స్థానం సంపాదించాలని ప్రతి ఒక్కరూ ప్రయత్నం చేసేవారు.

తను మొదట నాటకంలో హీరోయిన్ పాత్ర ధరించి నప్పుడు మధు హీరో పాత్ర దాల్చాడు. మధు మధ్యరకం కుటుంబీకుడైనా లేనిదర్జాలకు పోయేవాడుకాడు. తనలా కాలేజీలో స్టు, సెకండు మార్కులు వస్తూవుండేవి. రచయితల సంఘం సెక్రటరీ అతనే. డ్రామాలో తనతోపాటు ప్రైజు కూడా పొందాడు.

ఏమైతే నేం! అతను తనని ఆకర్షించాడు. తమ ఇద్దరి మనస్తత్వాలు ఒకటి గానటమే దానికి ముఖ్యకారణం. ఎప్పుడైనా తను డిబేటులో పాల్గొంటే, అందరూ ఎదురు వాదిస్తూ

వుంటే మధు తన ప్రక్క పాయింట్స్ చెప్పేవాడు. లక్షాధి కార్లు తనకు దాసోహం చేస్తామన్నా వినకుండా తన తల్లి దండ్రులకు చెప్పి, స్వయంగా ఒప్పించి తనే మధుని వివాహ మాడింది. అది తన జీవితంలో ఒక ముఖ్యమైన సంఘటన. పవిత్రమైందికూడా. కాలచక్రం దొర్లిపోయింది. సంవత్స రాలు గడిచిపోయాయి. అప్పటికి తనకు ఇరవైయేళ్ళు దాటాయి తన ముదుసలి తల్లి తండ్రులు యీ లోకాన్ని విడిచిపోయారు. తను ఏకైక పుత్రిక గావటంతో ఇక తనకు నా అన్నవారెవరూ లేరు.

♦ ♦ ♦

మధు వాళ్ళమ్మ గంపగయ్యాళి. తండ్రి లేడు. తను క్రొత్తలో కాపురాని కెళ్ళినపుడెలావున్నా తరువాత ఊపిరి పీల్చుకోటానికి తీరిక లేకుండా అత్తమానం చేస్తుండేది. అప్ప టికీ ఇంట్లో పాచిపని దగ్గిర్నుంచి, అంట్లుతోమి, వంటచేసి, బట్టలుతికి, అత్తగారికి స్నానానికి నీళ్ళుతోడి భోజనం వడ్డించే వరకు తనే. పనిమనిషైనా లేదు. ఏమాత్రం పిల్చినవెంటనే రాకపోయినా, అత్తగారి శాపనార్థాలు తప్పవు! ఇంకా అప్ప టికీ వెరిపించి కొడుకుతో చెప్తుంది.

క్రొత్తలో మధు ఎటూ మాట్లాడక పోయినా, తరువాత అపుడపుడు తననే మందలిస్తుండేవాడు. చేసికూడ మెప్పులేని గతిపట్టింది తనకు. రానురాను అత్తగారి సాధింపు ఎక్కువైంది. ఎలావున్నా తనూ ఒక మానవమాత్రురాలేగా!

అపుడపుడు అత్తగారి మాట కాదనక తప్పేదికాదు. వేరిపించి ఆమె కొడుకుతో చెప్పటం. మధు మందలించటమే గాక, తనని కొట్టటంకూడ జరిగాయి. ఈ నరరూప రాక్షసులు తోటి మానవజీవి బాధను గుర్తించలేరు. అమ్మతోపాటు చదువు కున్న కొడుకూ తయారవటంతో ఇక తను సహించలేక పోయింది. ఎలాగోలాగు బాధపడ్తూ, తినీతినక జీవితం గడ పటం ప్రారంభించింది. అంతకన్నా చేయగలిగిందేముంది. తన జీవితం బాధామయ గాథగా దిగజారిపోయింది.

*　　*　　*

ఆరోజు తల్చుకుంటే తన వళ్ళు యిప్పుడు కంపించి పోయింది.

ఆ రోజు మధు నిప్పులు గ్రక్కుతూ, ప్రళయ మార్తాం డునిలా ఇంటికి వచ్చాడు. తను మధును ఆ ఆకారంలో ఇంతకు ముందెప్పుడూ చూసివుండదు. తనతో మాట్లాడలేదు. తనే 'స్నానానికి నీళ్ళు పెట్టనా' అని అడిగింది.

కర్కశ కఠోర స్వరంతో 'అదంతా తరువాత ముందు బయటికి నడువు.' తనకేమీ తెలియదు. ఆశ్చర్యపోయింది. నవ్వుకూడా వచ్చింది. మధు మాటలువిని, ఆపుకోలేక పకపకా నవ్వేసింది.

ఏనాడో నవ్విన నవ్వును ఈనాడు జ్ఞప్తికి తెచ్చు కుంటూ, కలలో నవ్విన సుధాదేవి ప్రకృతిని ప్రతి ధ్వనింపజేసి గాలి అలలలో లీనమైంది.

ఆశ్చర్యం! తను నవ్వేలోపలే మధుచేయి తన చెక్కిళ్ళ మీద ప్రళయతాండవం చేసింది. ఇక తను సహించలేక పోయింది. 'ఏమిటి యీ దౌర్జన్యం? ఏమీ తెలియని నామీద?' అని రోషంగా ప్రశ్నించింది. కోపం, రోషం, ద్వేషం, దుఃఖం ముప్పిరిగొని వచ్చాయి. వళ్ళు కంపరమెత్తింది.

'ఏమిటీ అన్యాయం!' రోషంతో మళ్ళీ పేలిపోయింది తను.

"అన్యాయం! అన్యాయంకదూ: సుధా! నీకపటస్వరూపం ఇంకెన్నాళ్ళు దాస్తావు. పో...పో ముందు. నా దగ్గర కన్పించకు." తనకేమీ అర్థంకాలేదు. ఉక్రోషం వెల్లుబికింది.

"ఎక్కడికి పొమ్మేది? నేనేం చేశాను? దొంగనను కున్నారా?"

ఏం చేయలేదు!! దొంగల్లో తెలివైన దొంగవు." మధు అనేమాటలకు తలతిరిగిపోయింది. వచ్చే దుఃఖం ఆపుకోలేకపోయింది.

"ఏం? ఏం చేశాను. నీ యింట్లో దొంగిలించానా? లేక ఎవరినైనా ఖూని చేశానా?"

"అందరూ చంపివేస్తుంటే నీవు బ్రతికుంచే ఖూనీ చేశావు నన్ను...పో...నిన్ను అంటకూడదు. సంఘంలో తలెత్తకుండా చేశావు నీవు అస్పృశ్యనివి."

తన కళ్ళు తిరిగినై. "ఏమిటీ మీరనేది! మీకు మతుందా...?" అనే లోపల్నే తన చెంప రెండోసారి ఫెళ్ళున పేలిపోయింది. బయటికి నెట్టి తలుపు వేశాడు.

అంతే! తను హరిజన బాలికట? తన తల్లి దండ్రులు చిన్నప్పుడే వదిలిపెడ్తే తనను పెంపుడు బ్రాహ్మణ కుటుంబం పెంచిందట. యీ రహస్యం ఇన్నాళ్ళబట్టి, తన సొంత తల్లిదండ్రులు బ్రతకటానికి దేశసంచార మెళ్ళటంతో తెలియ లేదట. ఇప్పుడు...వారొచ్చారట...

అంతే, తను అంటరానిది! తనను భర్త వదిలిపెట్టాడు. ఇక తనను సంఘంకూడా అంటదు. అయితే తనకాశ్చర్యం ఒకటే. తను కాలేజీరోజుల్లో చూసిన మధు, ఇప్పటి మధూ ఒకరేనా? ఆనాటి అవ్యక్త బాంధవ్యం...అనురాగబంధం, ఆ...ప్రేమ ఏమయినాయి? మధు గుండె కారురాతి బండలా మారిపోయిందేం?

అదే...ప్రకృతి ప్రభావం! అదే సంఘ నిజ స్వరూపం! సంఘం అతణ్ణి శుద్ధ బ్రాహ్మణవంశం చెడిపోయిందని గోల పెట్టింది. సంఘ ఘోషతో అతడు సంఘ బహిష్కారానికి గురి అయినాడు. సంఘానికి కట్టుబడ్డాడు ... అతన్ని ఏమను కుంటే ఏముంది?...

మధు మళ్ళీ పెళ్ళాడాడు ... ఆ బ్రాహ్మణ స్త్రీతో చక్కగా కాపురం చేస్తున్నాడు. తనను వదిలిపెట్టి బ్రాహ్మణ సమాజానికి బంతిపెట్టగానే అతని అపవిత్రత అడుగంటింది. అతను వేదమంత్రాలతో పవిత్రుడైనాడు. అంతే సంఘ స్వరూపం!!!...

మరి తనో...తను ఇలాగే యీ రెండేళ్ళుబట్టి కాలక్షేపం చేస్తోంది. విధికి తనపై దయరాలేదు. తనకు మరణం దనతకూడా భయపడింది. జీవచ్ఛవములా కాలం గడుపుతోంది, తన భారమైన జీవితాన్ని, తను కోర్టుకు పోయింది. సంఘం తనని పిచ్చిదానిలా నిరూపించింది. మధు రెండు వేలతో కేసు మాఫైంది. అంతే...అగ్నిహోత్రం ముందు మధు చేసిన పెళ్ళినాటి పవిత్ర ప్రమాణం, శిలాక్షరాలుగా నిలవవలసిన బాసలన్నీ జలాక్షరాలుగా మాసిపోయాయి...

సుధాదేవి మనస్సు పూర్తిగ కల్లోలితమైంది. తన గత జీవితస్మృతితో ఆమె పూర్తిగా బలహీనురాలైంది. ఇందాకటినుంచీ తన మనోరంగంలో ప్రదర్శింపబడే గత జీవిత చిత్రాన్ని అవలోకిస్తున్న తన కళ్ళు ఇపుడు బాహ్యప్రకృతిని విలోకిస్తున్నాయ్. ఆమెకేదో విచిత్రమైన వూహా తట్టినట్టుంది. ఇందాకటినుంచీ కారిన సంతాపబాష్పాలు సంతోష భాష్పాలుగామారినయ్. ఆమెకుఏదోఒకదోవచూపెట్టినందుకు విధిని వేవిధాల ప్రార్థించింది. తన జీవన్మరణ సంధ్యాసమస్యను గురించి, దీర్ఘ నిద్రా మెలకువల ప్రభాత సమస్యనుగురించి, తన అంతరాత్మలో దీర్ఘమైన యుద్ధం ప్రారంభమైంది.

సుధాదేవికి జటిల సమస్యలను విశదీయగల వివేకము, సామర్థ్యమూ వున్నవి. ఎట్టి క్లిష్టపరిస్థితులలోనైనా, ఆమె ఏనాడు ధైర్యాన్ని విడిచిపెట్టలేదు.

ఆమె సంఘాన్ని గురించీ మానవరూప జంతువులను గురించి దీర్ఘంగా ఆలోచించి బుర్ర పాడుచేసుకోదలచ కోలేదు.

'చచ్చిసాధించేదేముంది? చావవద్దు. అది తెలివిహీనులు చేసే పని'. అనిసంబోధించిం దంతరాత్మ.

'చావు. ఎంత త్వరగాచస్తే అంత మంచిది. ఈ నికృష్టపు బ్రతుకు యీ యమయాతనల నరరూప రాక్షసుల నరకకూపాలలో, భూలోకంలో నీలాటి అమాయక ముగ్ధలకు తావులేదు.' ఆజ్ఞయిచ్చింది మనస్సు, చివరికి అంతరాత్మ సలహాలోనే ఎక్కువ నిజం కన్పించినట్లుంది. ఏం, ఎంత అభాగిని అయినా తనుమాత్రం యీ ప్రపంచంలో జీవించ కూడదా? ఛీఛీ యీ మృతజీవిగా బ్రతకటంకంటే చావటం వెయ్యి రెట్లు మేలు. ఈ విశాల విశ్వంలో తనలాటి అల్పప్రాణికి అనల్ప విశ్వసృష్టి సృష్టి ఏ కొంచెం చోటో కేటాయించకపోదు? ఇవ్వకపోదు. ఆలోచనలతో ముందుకు నడుస్తూంది సుధాదేవి.

పవిత్రతకు నేనే మూలం అని సగర్వంగా చాటుతున్నట్లు గంగాభవాని జలజలా, గలగలా, ప్రవహిస్తోంది. ఆకాశంలో మునిగిపోయే సూర్యభగవానుడు గంగానదిలో స్నానం చేస్తున్నాడు. ప్రకృతంతా నిశ్శబ్దంగా, నిశ్చలంగా, నీరసంగా, సుధాదేవి మనస్సులో నిరాశ ప్రకృతిలోగూడా కన్పిస్తూంది.

గంగా తరంగాలు తననే రమ్మని, ఆహ్వానిస్తున్నట్లు, అమరసందేశాన్ని చాటుతున్నట్లు తమ ఆతిథ్య ధర్మంలో కెరటాలు కేలెత్తి సుస్వాగతం పల్కుతున్నట్లు అనిపించింది_ అనంతయాత్రలో అంతిమ సోపానం చేరబోతున్న సుధకు.

సుధాదేవి నిర్ఘాంతపోయి నిశ్చల నిరీహ, నీరస, నిర్నిమేష లోచనమ్ములతో అవలోకిస్తోంది గంగాభవానిని.

సుధాదేవి ఇట్టి క్లిష్టపరిస్థితిలోకూడా భారతీయ గృహిణి ఆచారం వీడలేదు. హృదయస్ఫూర్తితో "దైవమా నేను తెలిసి ఏ తప్పూ చేయలేదు నాభర్త చాలా మంచి వాడు. విధివ్రాత నన్నిలా చేసింది ఇదంతా నా పూర్వ జన్మ సుకృతఫలితమే! ఏనాటికైనా నా భర్త మనస్సు త్రిప్పి వారి దృష్టిలో నే నిర్దోషినని ఋజువుచేస్తే నా జన్మ ధన్య మవుతుంది. వచ్చే జన్మలోకూడా అతడే నా భర్త కావాలి. ఇది కడసారి ప్రార్థన. మన్నించి నెరవేర్చు. అతడే నా ఆత్మ దైవం" అని ఇష్టదేవతా ప్రార్థనచేసింది.

తన మనస్సులో యిందాక జరిగిన దారుణ భీషణ సంగ్రామంలో తను తేల్చిన సిద్ధాంతం, సరిగా ఆత్మతో ఇప్పుడు ఎదురుతిరిగింది. గంగాభవానికి నమస్కరించి ముందుకు నడిచింది. వెనుక 'అమ్మా' అన్న ఎవరో ముసలి తాత అరుపు గంగా తరంగాల మ్రోతల్లో మాయమైంది.

—o—

## ఇంటింటా ఉండవలసిన ఉత్తమ సాహిత్యం

| | | |
|---|---|---|
| మధుర కవితలు | "ఎల్లోరా" | 10.00 |
| సరాగాలు | ,, | 4.00 |
| అంబాపాలి | కె. రమేశ్ | 4.00 |
| టాగూర్ ఉత్తరాలు | యన్. యన్. రావు | 2.00 |
| మెరుపులు-మరకలు | గోపీచంద్ | 5.00 |
| పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా | ,, | 5.00 |
| గాలిపడగలు-నీటిబుడగలు | లత | [illegible] |
| జీవనజ్యోతి | "మహేంద్ర" | [illegible] |
| సమర్పణ (నవల) | ,, | [illegible] |
| చీకటిలో చీలికలు | గొల్లపూడి మారుతీరావు | [illegible] |
| అలెగ్జాండర్ (నాటకం) | తిపిర్నేని | [illegible] |
| చీకటి వెలుగులు (నాటకం) | ,, | 1.00 |
| రాగహృదయాలు (నాటిక) | ,, | 0.75 |
| చిగురించినమోడు (నాటిక) | ,, | 0.75 |
| రక్త సంబంధాలు (నాటకం) | కొడాలి గోపాలరావు | 2.00 |
| సుఖదుఃఖాలు (నాటకం) | ,, | 2.00 |
| కల | డా॥ యన్. వి. కామేశ్వరరావు | 2.00 |
| జీవనపథము (మానవధర్మములు) | తిపిర్నేని లక్ష్మీనారాయణ | 1.25 |
| గ్రామసేవక్ (నాటకం) | నండూరి సుబ్బారావు | 1.50 |
| సునీత (నవల) | ఐ. యల్. యన్. శాస్త్రి | 2.75 |

ప్రతులకు :

**విజయభారతి పబ్లికేషన్స్**

పటమట :: విజయవాడ-6



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA10913,178 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | ASWINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |